


రమణ భక్తుడు - కవిశేఖరుడు

# శ్రీమురుగనార్

రచయిత్రి శ్రీమతి టి.ఆర్. కనకమ్మ

శ్రీరమణాశ్రమము తిరువణ్ణామలై - 606 603

ప్రకాశకుల మాట

శ్రీరమణ భగవానుల అనుగ్రహానికై, వారి పాదములను శరణు పొందిన భక్త శిరోమణులలో ప్రథములు 'శ్రీమురుగనార్'. వారి వైరాగ్యం, సన్న్యాసం చాలా పొగడతగినవి. వారి కవితాభక్తి భగవానులచేతనే ఆదరింపబడింది. శ్రీమురుగనార్, తమ సద్గురువులుగా శ్రీరమణులను స్వీకరించిన మరుక్షణం నుండి, వారి గురించిన చింత, స్తోత్రం తప్ప వేరే ఆలోచనలకు తావివ్వని విరాగులు అయ్యారు. రమణ స్మరణ ఒక్కటే స్థిరపడింది. ఈ గురుభక్తికి అక్షర రూపం ఇచ్చి, అనేక వేల సంఖ్యలో పద్యాలు రచించి, తన గురుమహిమను తమిళ లోకానికి అందించినవారు. శ్రీమురుగనార్ పద్యములను క్రమబద్ధీకరించి, వ్యాఖ్యలు వ్రాసి, గ్రంథరూపంలోకి తీసుకురావడానికి సహాయకారిగా వున్న 'శ్రీసాధు ఓం' గారికి రమణ భక్తులు ఎపుడూ ఋణపడి వుంటారు.

శ్రీమురుగనార్ గారి 'శ్రీరమణ సన్నిధిమురై', 'గురువాచకకోవై' అనే రెండు నేత్రాలు అనబడే గ్రంథాలను, శ్రీరమణాశ్రమం ప్రచురించింది. ఢిల్లీ రమణ కేంద్రం, వారి ఇతర రచనలకు గ్రంథరూపం ఇచ్చింది. ఇంకా అనేకవేల పద్యాలు ముద్రింపకుండా వుండిపోయాయి. వీటిని కూడ, రమణానుగ్రహంతో త్వరలో గ్రంథంగా వెలువడునని చెప్పుటలో సందేహం లేదు.

ఈ మహావ్యక్తికి శతజయంతి వుత్సవం 1991లో జరుపబడింది. రమణ భక్తులు అందులో పాల్గొన్నారు. ఆ శతజయంతి సందర్భంగా, శ్రీమురుగనార్కి అంజలిగా ఈ గ్రంథం ప్రథమ ప్రచురణగా తెచ్చాము.

దీనిని రచించిన 'శ్రీమతి కనకమ్మగారు', మురుగనార్పై అత్యంత భక్తి గౌరవములు కలిగినవారు. వారి నుండి భగవానుల "గ్రంథమాల" పాఠాలు నేర్చుకున్నవారు. వీరి సేవకు తమిళ ప్రపంచం ఋణపడి వుంది.

శ్రీమురుగనార్

ఇపుడు ఈ గ్రంథం ద్వితీయ ముద్రణకు రావడం ఎంతో ముదావహం. మొదటగా దీనిని తమిళ మూలం నుండి శ్రీతాడిమేటి సత్యనారాయణగారు. తెలుగులోకి అనువదించారు. ఇపుడు భాషాశైలి మార్చి ఈ రకంగా ప్రచురిస్తున్నాం.

శ్రీరమణాశ్రమము
ప్రకాశకులు

తిరువణ్ణామలై
14-05-2007.

ఓం నమో భగవతే శ్రీరమణాయ

ఉపోద్ఘాతము

గుట్ట దేవుడు అగు కుమారస్వామికి 'తమిళ దైవం' అని ఒక ప్రత్యేకమైన పేరు కలదు. కుమారస్వామి అవతారమైన శ్రీరమణ భగవానునకు కూడా తమిళ భాషంటే చాలా మక్కువ, అభిమానం వుండేది. మధురలో ఈయన పాఠశాల విద్యార్థిగా వున్నపుడే, 'తమిళ వ్యాకరణ గ్రంథం (నన్నూల్) వంటి తమిళ గ్రంథాలను అభ్యసించడమే కాకుండా, దానిని గురించి తరగతులలో వుపాధ్యాయులకే కలిగే సందేహాలకు తడబడకుండా సమాధానం చెప్పేవారు. దీనినిబట్టి భగవానునికి వున్న తమిళ భాషా పరిజ్ఞానం, అభిమానం అర్థమవుతుంది. భగవాన్ రచించిన గ్రంథాలలో అతి కొన్ని తప్ప మిగిలినవన్నీ తమిళంలోనే వున్నాయి.

భగవాన్ దర్శనానికి వచ్చే భక్తులు ఎవరు ఏ భాషలో ప్రశ్నలు అడిగినా, ఎక్కువగా భగవాన్ సమాధానం తమిళంలోనే. భగవాన్ మాట్లాడే తమిళం అతి సులభమైందిగానూ, సరళమైందిగానూ, తేట జలప్రవాహంగానూ వుండును. తేటతెల్లని తమిళంతోపాటు మందహాసంతో కూడిన భగవానుని వదనం వర్ణనాతీతం.

తమిళ దైవమగు రమణుని అరుదైన కావ్యములను, వారు భక్తులను కరుణించిన రీతిని, భక్తులపై కురిపించిన అనుగ్రహ శక్తిని రసమయంగా చక్కని తమిళ పద్యాలుగా రచించారు శ్రీమురుగనార్. అనుగ్రహానికి ఒక ప్రమాణంగా నిలబడి సాక్షీమాత్రంగా వెలుగొందిన శ్రీరమణుల కరుణాకీర్తిని ప్రశంసించి, పాడుటతో పాటు వారి వుపదేశములన్నిటిని ఒక దండగా కూర్చి ఇచ్చారు.

భాషాసమృద్ధి గల కవితాసాగరం 'శ్రీమురుగనార్', మంచి తమిళ మేధావి. వీరి రచనా విధానం ఆనాటి సంగకాలపు తమిళానికి సమానం అగును. వీరు భగవాన్ గురించి రచించిన స్తోత్ర పద్యములు పాడేవారి హృదయాలను ద్రవింపచేసి, ఆనందంతో పరవళ్ళు తొక్కేటట్లు చేస్తాయి.

మహాత్ములు ప్రపంచంలో అవతరించునపుడు, వారి అవతార రహస్యమును కీర్తించి, వ్యాపింప చేయడానికే కొందరు పెద్దలు కూడ దర్శనమిస్తారు. వారు రచించే గ్రంథాలే భావితరాలకు ఆ జ్ఞానజ్యోతులు మార్గదర్శకములుగా సహాయపడతాయి.

భగవానుని అనుగ్రహ కీర్తిని పాడుట కొరకే వచ్చినవారు శ్రీమురుగనార్. వీరు రచించిన అనేక వేల పద్యాలలో, భగవానుని తప్ప వేరే దైవమును స్తుతించి పాడలేదు. భగవానులు బోధించిన వుపదేశముల సారాంశం, ఏ విధంగానూ మార్పు చెందని అక్షర కళాఖండములుగా తీర్చిదిద్దారు. కాలంతో గ్రంథవస్తువు చెదరిపోకుండా వాటిని పద్యాలుగా రూపొందించారు. ఈ గ్రంథాలు, రాబోయే తరాలకు రమణ భగవానుని సత్యబోధను తెలుసుకోవడానికి సహాయకారులుగా వుండి వుపయోగపడతాయి అనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

మురుగనార్గి గురుభక్తి సాటిలేనిది. వారు భగవానుని దివ్యసన్నిధిలో కూర్చోవడమే మహాభాగ్యంగా ఎంచారు. "ఎవరి సిఫార్సు లేకుండా, స్వతంత్రంగా కూర్చొని అనుభవింపదగ్గ 'సన్నిధి మహిమ' ఒక్క భగవానుని సన్నిధిలోనే" అని చెప్పేవారు శ్రీమురుగనార్. వీరు వేదాంత పాండిత్యాన్ని కలిగి వున్నా, నమ్రతకు వుదాహరణగా జీవించిన మహాజ్ఞాని. పేరు, ప్రతిష్ఠ, కీర్తి అనే వంచనలకు అందని ధీరుడు. వీరి శతజయంతి 1991వ సంవత్సరం మార్చి నెలలో "రమణ మహర్షి సెంటర్ ఫర్ లెర్నింగ్" అనే సంస్థచే బెంగుళూరులోని తమిళసంఘ వేదిక మీద అతి వైభవంగా జరిగింది. ఇదే సంవత్సరం నవంబరు 10, 11 తేదీలలో శ్రీరమణాశ్రమంలో కూడా మురుగనార్ శతజయంతి చాలా వేడుకగా భక్తులు జరుపుకొన్నారు.

నా సత్కర్మ ఫలితంగా మురుగనార్ను కొద్దికాలం సేవించే భాగ్యం పొందాను. అపుడు వారి దగ్గర పాఠాలు వినే భాగ్యం కూడ కలిగింది. వారు పాఠాలు చెప్పునపుడు, అనేక అరుదైన గొప్ప విషయములను గురించి చెప్పేవారు. వాటన్నిటిని జ్ఞాపకం వుంచుకొనే శక్తి లేకపోయినా, వారి గురుంచి నా స్మృతిపథంలో ఎప్పటికీ పసివాడక నిలిచి వున్న కొన్ని సంఘటనలను, ఆయన శతజయంతి వుత్సవ జ్ఞాపికగా ఈ చిన్న గ్రంథమును రచించి, ఆ ఆనందమును నేను కూడా మీతో పంచుకొంటున్నాను.

టి.ఆర్. కనకమ్మ

01-10-1991
శ్రీరమణాశ్రమము

# విషయ సూచిక

1. శ్రీమురుగనార్
2. మద్రాసులో ఉద్యోగం
3. గురు దర్శనము
4. తల్లికి భగవానుల దర్శనం చేయించడం
5. తల్లి శివపదమును పొందడం
6. అణ్ణామలైలో స్థిర నివాసం
7. మురుగనార్ పల్లాకొత్తు నివాసం
8. శ్రీరమణ సన్నిధిమురై గ్రంథ చరిత్ర
9. ఉన్నది నలుబది
10. తడి
11. గురువాచక కోవై
12. శ్రీరమణ దేవమాల - రచన
13. శ్రీరమణ చరణం కలకాలం వర్ధిల్లు గాక!
14. అక్షరమణమాల వ్యాఖ్య, రచన
15. శ్రీరమణానుభూతి - రచన
16. రమణ జ్ఞానబోధం
17. తమిళ భాషాభిమానం
18. గురి తప్పని వధ
19. రమణీయ పద సుఖుడు
20. తిరుచ్చాషల్ (సఖీ గీతాలు)
21. తిరువమ్మానై
22. తిరుకణోక్కమ్
23. ఏకాగ్రభక్తి
24. ఆకులు కోయుటకు వెళ్ళినది
25. శివరాత్రి ఉపవాసం
26. పొదుపైన సంసార జీవనం
27. వడ్రంగం తెలియనివాడు
28. మురుగ మాయావి
29. మూలధనమునే కబళించు గురువు
30. బ్రాహ్మణులు ఎవరు?
31. చదువులో ఏమీ లేదని తెలుసుకోవడానికే చదువు
32. పూజకు మోక్షం
33. కురళ్ళు సంగ్రహించిన అవ్వైయార్
34. అవియల్ - ఆదెమ్మ .
35. మీకు ఎవరు ఇస్తారు?
36. సరస్వతి పూజ

ఓం నమో భగవతే శ్రీరమణాయ



ఓం నమో భగవతే శ్రీరమణాయ

# శ్రీమురుగనార్

'తిరువణ్ణామలై' పేరు వినగానే, ప్రజలకు వెంటనే జ్ఞాపకం వచ్చేది అణ్ణామలై స్వామీ (అరుణాచలేశ్వరుడూ), కార్తీక దీపమూ. దీనితోపాటే జ్ఞాపకం వచ్చేది శ్రీరమణ భగవానూ, వారి ఆశ్రమమూ. ఈ రెండూ ఒకదానికి ఒకటి పెనవేసుకొన్నవి.

ఇలాగే భగవాన్ను దర్శించేటప్పుడు, వారి భక్తులకు శ్రీమురుగనార్ కూడా జ్ఞాపకం వస్తారు. భగవాన్ మీద వారికి వున్న ప్రేమభక్తుల వలనా, సదా వారిని అనుసరించి వుండడంచేతా, వీరిని "భగవాన్ యొక్క నీడ" అని కూడా చెప్పడం వుంది!

రామనాథపురం వాస్తవ్యులూ, సత్యసంపన్నులూ అయిన ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో మురుగనార్ 1890 ఆగష్టు నెలలో జన్మించారు. సుబ్బలక్ష్మి అమ్మాళ్, కృష్ణ అయ్యర్లు వీరి జననీ జనకులు. శైశవంలోనే వీరి తండ్రిగారు మరణించినందువలన, తల్లియే వీరిని పెంచింది. అయిదేండ్ల వరకు వీరికి మాటలు రాలేదు. నోట్లోంచి ఎపుడూ చొల్లు కారుతుండేదట! రాబోయే కాలంలో మహాపండితుడూ, మహాకవీ అవడంకోసం బాల్యంలో ఇలా మూగతనంతో వున్నారా వీరు?!

రామనాథపురంలోని స్కాట్ మిషన్ స్కూల్లో వీరి చదువు మొదలై, అక్కడే పదవ తరగతి వరకు చదువుకున్నారు. ఒక బంధువు సాయంతో, ఆ తరువాత వీరు మధురలో రెండేళ్ళు చదివి మెట్రిక్ పరీక్ష పాసయ్యారు. వీరికి 'సుబ్రహ్మణ్యం' అని నామకరణం చేసినప్పటికీ, ఇంట్లో మాత్రం 'సాంబశివుడు' అని పిలిచేవారు.

మధురలో చదువు ముగిసాక, వీరు రామనాథపురం తిరిగి వచ్చారు. రామనాథపురం రాజకుటుంబానికి చెందిన 'వేలుస్వామి దేవర్' అనే ఆయన కోరగా, ఆయనకు 'తిరుక్కురళ్' నేర్పడం మొదలుపెట్టారు. దానితో వీరు అంటే ఆ రాజకుటుంబానికి ఎంతో గౌరవం ఏర్పడింది. వీరి సచ్ఛీలమూ, నడతా అందరినీ ఆకర్షించాయి. పోగా, ఆ కుటుంబీకులకు తమిళంమీద ఎంతో మక్కువ.

ఆ రోజుల్లో 'రావు సాహెబ్ ము. రాఘవ అయ్యంగార్' అనే గొప్ప తమిళ విద్వాంసుడూ, మేధావీ రామనాథపురం సంస్థానంలో ఆస్థాన విద్వాంసుడుగా వుండేవారు. వారి స్వస్థలం కూడా అదే. వారు తమిళ భాషకు ఎనలేని సేవ చేసారు. ఆ ఆస్థానంలో వారితోపాటు మరో పండితుడు కూడా వుండేవారు. వారి పేరు కూడా 'రాఘవ అయ్యంగారే'. రాజకుటుంబానికి తమిళ భాషమీద ఎంతో అభిమానం వుండడంచేత, వీరిద్దరినీ ఆస్థానంలో వుంచుకొని, తమిళ భాషకు ఆ కుటుంబం ఎంతో సేవ చేస్తూ వచ్చింది.

చదువు ముగించుకొని మధుర నుండి వచ్చిన మురుగనార్కు, ఇప్పుడు తమిళ విద్వాంసులతో మిక్కిలి సన్నిహితంగా మెలిగే అవకాశం లభించింది. అక్కడ వీరు అనేక గ్రంథాలను పరిశోధించారు. అక్కడ వీరు తమిళ సాహిత్యంలో పంచమహా కావ్యాలుగా పేరు పొందిన 'శిలప్పదికారం, మణిమేగలై, వళయాపతి, కుండలకేశి' మొదలైనవాటినీ; 'తిరుక్కురళ్'ను, 'నన్నూల్' అనే వ్యాకరణ గ్రంథాన్నీ, 'నైషధం' మొదలైన ప్రాచీన కావ్యాలనూ క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. తిరుక్కురళ్ను వీరు పై నుంచి క్రిందకు, క్రింద నుండి పైకి అప్పజెప్పగలిగేవారు. ము. రాఘవయ్యంగార్ వంటి తమిళ భాషా పండితులతో కలిసి, వీరు 'తమిళ భాషా శబ్దరత్నాకరా'న్ని నిర్మించే పనిలో అక్కడ నిమగ్నమయ్యారు. 'తమిళ భాష శబ్ద రత్నాకర సంఘం' వీరిని అందులో ఒక సభ్యునిగా ఎన్నుకొంది.

దానితో వీరికి అనేకమంది విద్వాంసులతో సన్నిహితంగా మెలిగే అవకాశం లభించింది. మహామహోపాధ్యాయ డాక్టర్ వి.వి. స్వామినాథయ్యర్, తిరుచిరపురం మీనాక్షి సుందర పిళ్ళై, రావు బహద్దూర్ చెంగల్వరాయ పిళ్ళై, ఎస్.సచ్చిదానంద

పిళ్ళై మొదలైన విద్వాంసుల సాన్నిహిత్యం వీరికి లభించడమే కాకుండా; అలాంటి మహా విద్వాంసులంతా మురుగనార్ బుద్ధి కౌశల్యాన్ని ఎంతగానో ప్రశంసిస్తూ వుండేవారు.

మురుగనాయొక్క తమిళం, సంగం కాలంనాటి తమిళంలాంటిది. అది ఎంతో అందంగా, భావగర్భితంగా, పాఠకుల హృదయాలను ఆకర్షించేటట్లుగా వుండేది. శ్రీచెంగల్వరాయ పిళ్ళైగారు మురుగనార్ను "ఈ శతాబ్దపు సంగకవి" అని చెప్పేవారు. రాఘవయ్యంగార్కు మురుగనార్ అంటే ఎంతో ప్రేమ, అభిమానం, విశ్వాసం వుండేవి. వీరే మురుగనార్ను మద్రాసులో వున్న 'నార్విక్ హైస్కూల్ ఫర్ గర్ల్స్' అనే ఆడపిల్లల స్కూల్లో, తమిళ పండితులుగా పని చేయడానికి ఒప్పించి పంపారు. వీరి తమిళ భాషా పాండిత్యం దినదినాభివృద్ధి పొంది, వీరి పేరు ప్రతిష్ఠలు రాష్ట్రం నలుమూలలా పాకాయి.

## మద్రాసులో ఉద్యోగం

మురుగనార్ మద్రాసులో వుద్యోగం చేస్తున్నపుడు, వారితోపాటు వారి భార్యా, తల్లీ కూడా వుండేవారు. వీరికి పిల్లను ఇచ్చిన మామగారు 'శ్రీదండపాణిస్వామి'. వీరు భగవాన్ శ్రీరమణులకు భక్తులు. వారు ఒకసారి శ్రీరమణాశ్రమం నుండి మద్రాసులో వున్న అల్లుని వద్దకు వచ్చినపుడు, శ్రీరమణుల "అరుణాచల స్తుతి పంచకము" అనే స్తోత్రగ్రంథాన్నీ, "నే నెవడను?" అనే విచారణా మార్గ గ్రంథాన్నీ మురుగనార్కు తెచ్చి ఇచ్చారు. దండపాణిస్వామిగారితోపాటు 'అయ్యాస్వామి పిళ్ళై' అనే భక్తులు కూడా అపుడు వచ్చారు.

శ్రీమురుగనార్ తీవ్రమైన గాంధేయవాది. వారికి గాంధీగారి మీద ఎంతో భక్తీ, ప్రేమా. వీరు ఖద్దరు బట్టల్ని మాత్రమే ధరించేవారు. దేశస్వాతంత్ర్యంకోసం జరుగుతున్న స్వాతంత్ర్య పోరాటంలో ఆసక్తి చూపించేవారు. భగవాన్ వద్దకు రావడానికి ముందే, భక్తి గీతాలు వున్న "స్వతంత్ర గీతాలు" అనే పుస్తకాన్ని వ్రాసారు.

మురుగనార్ వ్రాసిన దేశభక్తి గీతాలను చూసిన దండపాణిస్వామి, అయ్యా స్వాములు "ఇవి చాలా బాగున్నాయి. వీటిని తిరువణ్ణామలై రమణ మహర్షి వారికి చూపిస్తే, వారు ఎంతో సంతోషిస్తారు. మహర్షికి ఇలా కవిత్వంతో వున్న గీతాలు అంటే ఎంతో ఇష్టం. వారి ఆశీస్సులతో మీ కవిత్వమూ, మీ కవిత్వ రచనాశక్తీ ఎంతో అభివృద్ధి చెందుతాయి" అని మురుగనార్ను తిరువణ్ణామలైకు రావలసిందిగా కోరారు. అయితే, మురుగనార్ భగవానన్ను ప్రత్యక్షంగా చూడడానికి ముందే, భగవాను అప్పటికే దర్శించుకొన్న కొందరు మిత్రులద్వారా 'వారి దివ్యశక్తి గురించీ, కరుణతో కూడిన వారి అనుగ్రహ సామర్థ్యాన్ని గురించీ' విని పులకించారు. దానితోపాటు ఇపుడు వీరి చేతిలోకి వచ్చిన భగవాన్యొక్క ఈ రెండు గ్రంథాలూ, వీరి జీవితాన్నే మార్చివేసాయి. భగవాన్ను చూడాలన్న కాంక్ష, వీరికి హృదయంలో రోజు పొంగిపొర్లేది. అయినా, వీరు వెంటనే శ్రీభగవాన్ వద్దకు వెళ్ళలేకపోయారు!

ఇంతకుముందే 'తిరువాచకం' చదివినపుడల్లా, 'మాణిక్య వాచకులకు, ఒక స్థల వృక్షం క్రింద సత్యజ్ఞాన గురు దర్శనమైనట్లుగా, తనకు కూడా అలాంటి దర్శనం ఎపుడు దొరుకుతుందా?' అని వీరు పరితపించడం మొదలుపెట్టారు. దీనిని గురించి మురుగనారే, తాము రచించిన 'శ్రీరమణ సన్నిధిమురై'లో హృదయం ద్రవించేట్లుగా పాడారు. ఇలాంటి స్థితిలో వున్న వీరికి, పైన తెలిపిన భగవాన్ గ్రంథాలను చదివిన వెంటనే, జీవితమే మారిపోయింది. హృదయంలో కోరికను అణచుకోలేకపోవడం వలన, 'ఎలాగైనా భగవాన్ను దర్శించాలన్న నిర్ణయానికి వచ్చారు.

## గురుదర్శనం

'ఎంతో కష్టంతో తల్లిని ఒప్పించి, సెలవులలో మొదటిసారిగా 21-09-1923 గురువారంనాడు తిరువణ్ణామలైకి వచ్చినట్లు'గా మురుగనార్ తమ పుస్తకంలో వ్రాసుకొన్నారు. తిరువణ్ణామలైకి వచ్చిన వారు ఒక రకమైన సంభ్రమాశ్చర్య స్థితిలో పడిపోయి, తమ సహజస్థితిని కోల్పోయారు. రైలు స్టేషను నుంచి ఆశ్రమానికి వెళ్ళాలనుకొని వెళుతున్న ఆయన, దారిలో ఆకాశాన్ని అంటుతున్న శ్రీఅరుణాచలేశ్వర దేవాలయ గోపురాలను చూసి, ఆ దేవాలయంలోకి

ప్రవేశించారు. అణ్ణామలై స్వామినీ (అరుణాచలేశ్వరుజ్జీ), ఉణ్ణామలై అమ్మవారినీ (అపీతకుచాంబా దేవినీ) దర్శించి, సేవించి వారు ఎంతో తృప్తి చెందారు.

ఆ తరువాత అంబ గర్భగుడి నుండి బయలుదేరి, ధ్వజస్తంభం దగ్గర వున్న మంటపానికి వచ్చి, అక్కడ నిలుచున్నారు. 'మహాత్ములను వట్టి చేతులతో దర్శించుకోరాద'నీ అపుడు ఆయనకు జ్ఞాపకం వచ్చింది. దానితో వారు ఆ మంటపంలోనే కూర్చుని, భగవాన్ మీద ఎంతో అందమైన పద్యాలు వున్న ఒక “దేశిక పదికము"ను రచించారు. అందులో, గురువును ప్రత్యక్షంగా చూడడానికి ముందే, ఆయన గుణ విశేషాలను ఎంతో చక్కగా వర్ణించడం విశేషం. సుందరమైన ఈ దేశిక పదికాన్ని భగవాన్కు కానుకగా భావించి, ఆయన ఆశ్రమం చేరారు.

'ఒక మహాత్ముడిని దర్శించడం ఎలాగ? వారికి నమస్కరించడం ఎలాగ?' అనేది తెలియని మురుగనార్, తడబడుతూ ఆశ్రమంలోకి ప్రవేశించారు.

ఆ రోజుల్లో ఆశ్రమం చాలా చిన్నదిగా వుండేది. భక్తులు కూడా చాలా కొద్దిమందే వుండేవారు. మురుగనార్ ఆశ్రమంలోకి వచ్చిన క్షణమే, శ్రీభగవాన్ గిరి వద్దకు వెళ్ళడానికి బయలుదేరుతున్నారు. 'ఈ శిష్యుని తడబాటు గ్రహించి, గురువే శిష్యునికి ఎదురువెళ్ళి ఆహ్వానించినట్లుగా', ఆ దృశ్యం అమరింది!

శ్రీభగవాన్ దివ్యరూపాన్ని దర్శించిన మాత్రంలోనే, మురుగనార్ హృదయం కరిగి, వారు నిశ్చేష్టులయ్యారు. భగవాన్ తమ కంటిచూపుతోనే, వారిపై అనుగ్రహ వృష్టి కురిపించడం మొదలుపెట్టారు. ఇలా ఇద్దరూ దృక్ వీక్షణాలతోనే కలసిపోవడం వలన, మాటల అవసరమే లేకుండా పోయింది. కాసేపటికి, మురుగనారు 'తాను భగవాన్పై వ్రాసిన పద్యాలు' జ్ఞాపకం రావడంతో, వాటిని భగవాన్ ముందు చదవడం మొదలెట్టారు. కానీ, పద్యాలన్నింటినీ చదవలేకపోయారు. వారికి అపుడు నాలుక మెలి తిరిగినట్లై గొంతు పూడుకుపోయి, నోట్లోంచి మాట బయటకు రాలేదు. అశ్రువులు కంటి చూపును అడ్డగించగా, పద్యాలు కళ్ళకు కెనిపించలేదు.

దీనిని గ్రహించిన భగవాన్, "ఇలా ఇవ్వండి, నేనే చదువుతాను" అని వారి చేతిలో నుండి పద్యాలు వ్రాసిన కాగితాలను తీసుకొని, వాటిని తామే చదివారు. మురుగనార్ అయితే, అపుడు తమ చక్షువులతో అనంత నేత్రుడైన భగవాన్నే ఆస్వాదిస్తుండడంతో, వారి హృదయంలో ఆనందతరంగాలు పొంగి, కంటివెంట ఆనందభాష్పాలు ధారగా ప్రవహించాయి. తన పద్యాలను శ్రీభగవాన్ చదవడం చూస్తూ, ఆయన పరవశుడై నిలిచిపోయారు. ఒక రాత్రి భోజనానంతరం, భగవాన్ సన్నిధిలో కూర్చున్న మురుగనార్లో హఠాత్తుగా ఒక అలజడి ప్రారంభమైంది. దానిని గురించి మురుగనారోయే ఇలా చెప్పారు:

"నేను తిరువణ్ణామలైకి వచ్చిన రెండు మూడు రోజులకు, నాలో ఏదో ఒక మార్పు కలిగింది. అదేమిటో నాకు తెలియలేదు. కానీ, అది నన్ను ఒక రకమైన వుత్సాహంతో ముంచేసింది. నేను మహర్షి సమక్షంలో కూర్చొని, ఆయనమీదే మనస్సును నిలిపి వుంచాను.

కొద్దిక్షణాల్లో, నాకు ఒక తేజస్సు కనిపించింది. వారి శరీరం చుట్టూ ఒక రకమైన కాంతి. అయితే, వారి శరీరం మాత్రం ఆ కాంతికి విలక్షణంగా వుంది. అది అలా ఎంతకాలం వుందో తెలియలేదు. నేను మాత్రం పూర్తిగా ఆ దృశ్యంలో మునిగిపోయాను. అపుడు అక్కడ కుంజుస్వామిగారు, దండపాణిస్వామిగారు, అరుణాచలస్వామిగారు వున్నారు.

ఆ సందర్భంలో, సహజమైన నా ప్రత్యేకమైన వునికిని పూర్తిగా పోగొట్టుకొన్నాను. ఆధ్యాత్మికమైన ఒకరకమైన మార్పు సముద్రంలాగ పొంగి, దానిని కబళించి వేసింది. నేను మెలకువగానే వున్నప్పటికి, నా అనుభవమంతా విచిత్రమైన ఒక కలలాగా ఆశ్చర్యంగా వుంది. ప్రపంచ విషయాలూ, విలక్షణమైన నా పూర్వపు వునికీ, దాని సహజత్వమూ - అన్నిటినీ పోగొట్టుకొంటున్నట్లు ఒక భయం నన్ను ఆవరించింది.

'దాని ఫలితంగా వేరే మార్గం లేక, నేను తిరువణ్ణామలైలోనే వుంటూ కాలం వెళ్ళబుచ్చవలసి వస్తుందేమో అనీ, మా తల్లికి జీవనాధారంగా వున్న నన్ను ఆమె పోగొట్టుకోవలసి వస్తుందేమో' అనీ నాకు అనిపించింది. ఈ భావాలతో నా నోటి నుంచి ఈ క్రింది మాటలు వెలుపడ్డాయి:

"ఇక్కడ రమణ మహర్షి అధ్యక్షతన 'సిద్ధులు' అనబడే మహాదొంగల గుంపు ఒకటి వుంది. దగ్గరకు వచ్చేవారి మనస్సుపైన మత్తుమందు చల్లి, వారిని సిద్ధుల జీవన మార్గంలోకి ప్రోత్సహించి, ఆ గుంపులో చేర్చుకోవడమే వారి పని అంతా! వారి వుక్కు పిడికిలి నుంచి నన్ను విడిపించుకొని పోవడానికి మా అమ్మకుగానీ, మరెవరికైనాగానీ సాధ్యం కాదు. కాబట్టి నేను వెంటనే ఈ స్థలం వదలిపెట్టి వెళ్ళాలి."

ఈ అనుభూతి తరువాత, శ్రీమహర్షిని చూస్తూ ఇలా అన్నాను:

"ఈ కొద్ది సమయమే మీ తేజస్సును చూసి, నేను ఓర్చుకోలేక పోతున్నానే! అటువంటిదానిని ఒక స్త్రీ అయిన మీ తల్లిగారు మిమ్మల్ని పది నెలలు మోసారంటే, అది ఎంత అద్భుతం!

ఇలా, ఒక రకమైన ఆవేశంతో మాట్లాడుతూ, మధ్యలో నమస్కరించి లేచి నిలుచున్నాను"

అని మురుగనార్ చెప్పారు. వారు అపుడు వేగంగా బయటకు వెళ్ళడం చూసి, భగవాన్ తమకు దగ్గరగా వున్న కుంజుస్వామి, అరుణాచల స్వాములకు 'మురుగనార్ వెంట వెళ్ళమన్నట్లు' సంజ్ఞ చేయగా, వారిద్దరూ ఆయన వెనుక నడవసాగారు. ఆశ్రమానికి కొంతదూరంలో వున్న అగ్నితీర్థందాకా మురుగనార్ వెంట ఆ ఇద్దరూ వెళ్ళారు. మురుగనార్ ఆగకుండా ఇంకా ముందుకు నడుస్తుంటే, కుంజుస్వామిగారు వారిని సమీపించి, "ఏమి స్వామీ! మంచి వెన్నెల కాస్తుంది కదా! ఈ చెరువు మెట్లమీద కూర్చోవచ్చు కదా!" అనడంతో, "సరే" అని ముగ్గురూ కూర్చున్నారు. కొన్ని క్షణాలు అలా కూర్చొని, మురుగనార్ తనకు కలిగిన అనుభవాన్ని తడబడుతూ వారికి చెప్పారు. తరువాత వారిద్దరూ మురుగనార్ కలవరాన్నీ, భయాన్నీ పోగొట్టడంకోసం 'భగవానియొక్క సాత్త్విక ప్రవృత్తినీ, కరుణాపూరిత వాత్సల్యాన్ని' వివరించి, "భయపడకుండా ఆశ్రమానికి రమ్మ"ని చెప్పారు. అయినా, మురుగనార్ చెంగం రోడ్డుమీదే అటూఇటూ తెల్లవారుజామున మూడు గంటల వరకూ తిరిగారు. మురుగనార్ ఆ తరువాత తనకు కలిగిన అనుభూతిని చెపుతూ:

"నేను ఆశ్రమం వదలి తప్పించుకొని పోవడానికి చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థం అయ్యాయి. నా అస్తిత్వం అంతా తిరువణ్ణామలైలో మునిగిపోయింది. 'తిరువణ్ణామలై వేరు, మహర్షి వేరు' అని కాకుండా అభేదం అయ్యాయి" అన్నారు. తరువాత వారు అక్కడ రెండు రోజులు వుండి, మద్రాసుకు తిరిగి వెళ్ళిపోయారు.

మరల మురుగనార్ భగవాన్ దర్శనంకోసం కొన్ని రోజుల తరువాత వచ్చారు. శ్రీమహర్షి ఎదుట కూర్చోగానే, వారికి మరల అదే అనుభవం. 'శ్రీభగవాన్ శరీరం తేజోమయమై, ఆ తేజస్సులో అతని ప్రత్యేక అస్తిత్వం మునిగిపోయింది.' తిరిగి భయం పట్టుకొంది. 'తాను ఇక్కడే వుండిపోతే, తన తల్లి తనను శాశ్వతంగా కోల్పోతుంది కదా!' అనే ఆలోచన వచ్చి, వెంటనే ఆ రాత్రే ఆశ్రమాన్ని వదలి, టౌనులో వుండి మద్రాసు వెళ్ళిపోయారు. (ఈ చివరి పేరాగ్రాఫ్లోని వివరాలు, మురుగనారే స్వయంగా చెప్పారు.) ఇది 1923 లేదా 1924 క్రిస్టమస్ సెలవుల్లో జరిగింది.

## తల్లికి శ్రీభగవానుల దర్శనం చేయించడం

1924వ సంవత్సరం శివరాత్రి రోజున, మురుగనార్ తన తల్లిని మహర్షి దర్శనం కోసం తీసుకువచ్చారు. ఆమెకు అక్కడ ఆదరపూర్వకమైన స్వాగతం లభించింది. మురుగనార్ కూడా ధ్యాననిమగ్నులు అయ్యారు. ఆ తరువాత సమయం దొరికినపుడల్లా, ఆయన భగవాన్ దర్శనానికి వచ్చిపోతూ వుండేవారు. ఒకసారి తమ తరగతి విద్యార్థులను కూడా తీసుకొచ్చి, భగవాన్ దర్శనం చేయించారు.

తరువాత వారు 'భగవాన్ తప్ప వేరే తలపులు లేనివారై', తదేక భక్తితో మెల్ల మెల్లగా భగవాన్ ప్రభావానికి లోనయ్యారు. మురుగనార్ తీవ్ర గాంధేయవాదీ, అహింసావాదీ. నోరు లేని ప్రాణులు అయిన గుర్రాలను, ఎడ్లను కట్టిన బండ్లను వీరు ఎక్కేవారే కాదు. రైలు స్టేషను నుంచి ఆశ్రమానికి నడిచే వచ్చేవారు. వీరు ఆశ్రమం నుండి తిరిగి వెళ్ళేటపుడు - తేనెలో పడ్డ తుమ్మెదలాగా - దానికే అంటుకొనిపోయి వెళ్ళలేకపోయేవారు. మద్రాసు వెళ్ళాలని బయలుదేరడం అయితే బయలుదేరేవారు. కానీ, కాసేపటిలోనే ఆశ్రమానికి తిరిగి వచ్చి నిలబడేవారు. దీనిని గ్రహించిన భగవాన్, "మురుగనార్ మద్రాసుకు వెళ్ళేటపుడల్లా, వారిని ఒంటరిగా పంపకుండా, ఎవరినైనా వారికి తోడు ఇచ్చి పంపి, స్టేషనులో వదలి రమ్మ"ని చెప్పేవారు.

ఆ తోడు వచ్చినవారు, వారిని స్టేషనులో దిగబెట్టి వెళ్ళిపోయేవారు. మురుగనార్ ఏమో స్థిమితం లేనివారిలాగ, ప్లాటుఫారంమీద అటూఇటూ పచార్లు చేసేవారు. కాసేపటికి బండి వచ్చేది. 'బండి వచ్చి ఆగి వుందనిగానీ, అందులో తాను ఎక్కాలి అనిగానీ' ఆలోచనే లేక, వారు ప్లాటుఫారంమీద పచార్లు కొనసాగిస్తూనే వుండేవారు. ప్రయాణీకులు ఎక్కడం, దిగడం ఇవేవీ వారుశ్రీమురుగనార్

గమనించేవారే కాదు. సమయం కాగానే రైలు వెళ్ళిపోయేది. రైలు వెళ్ళిపోయాక ఏమీ తోచక ఒక దీర్ఘమైన నిట్టూర్పు వదలి, ఆశ్రమానికి తిరిగి వచ్చేవారు.

తిరిగి వచ్చిన ఈయనను చూసి, 'ఏమిటి? రైలు రాలేదా?' అని అడిగితే, వారు 'వచ్చింది' అని చెప్పేవారు. 'మరి రైలు ఎందుకు ఎక్కలేదు?' అని అడిగితే, 'నాకు రైలు ఎక్కాలన్న ఆలోచనే కలుగలేదు. అది కలిగేలోగా రైలు వెళ్ళిపోయింది' అని నిష్కపటమైన హృదయంతో చెప్పేవారు. వారి ముఖం చూస్తే ఎంతో జాలి కలిగేది. 'సరి, సరి' అని భగవాన్ వారిని ఓదార్చేవారు. తరువాత రోజుల్లో మురుగనార్ ఊరికి వెళ్ళాలంటే, 'ఎవరినైనా వారితో పంపి, రైలు ఎక్కించి తిరిగి రావలసింది'గా చెప్పేవారు.

## తల్లి శివపదం పొందడం

మురుగనారకు 'ఇలా శ్రీఅరుణాచలానికి అపుడపుడు వెళ్ళి రావడం'లో బొత్తిగా సంతృప్తి లేదు. 'ఎలాగైనా అన్నీ వదిలేసి శ్రీఅరుణాచలానికే వచ్చి, భగవాన్ శ్రీరమణుల పాదాలే శరణం అని వుండిపోవాల'న్న కోరిక, తీరని కోరికగానే వుండిపోయింది. పాపం! ఆయన ఏం చేస్తాడు?!

తాను తప్ప వేరే దిక్కు లేని తన తల్లిని, ఆయన ఎవరికి అప్పగిస్తారు? వారికి ఏమో తల్లిమీద ఎంతో ప్రేమ, అభిమానం. ఎవరికి అప్పగిస్తారు? అందువలన తల్లి జీవించి వున్నంతవరకూ, వారు శ్రీఅరుణాచలంలో వుండిపోకుండా, మద్రాసుకు రాకపోకలు సాగిస్తూ వుండేవారు. అయితే వీరి కోరిక తీరే సమయం వచ్చిందా అన్నట్లుగా, వీరి తల్లి కొన్నాళ్ళకు. పరమపదించింది.

తల్లికి చేయవలసిన కర్మకాండను అంతా విధ్యుక్తంగా పూర్తిచేసి, అస్తికలను కొన్నింటిని ధనుష్కోటిలో నిమజ్జనం చేసి, మరికొన్నింటిని ఒక మృత్తికా ఘటంలో తీసుకొని శ్రీఅరుణాచలానికి వచ్చారు.

అస్తికలు వుంచిన ఘటాన్ని, ఆశ్రమం ముందు వున్న పెద్ద చెట్టు క్రింద వుంచి, స్నానం చేసి, భగవాన్ వద్దకు వెళ్ళి నమస్కరించి నిలబడ్డారు.

మురుగనార్ను చూసిన వెంటనే భగవాన్, 'మీ తల్లి కర్మకాండ అంతా పూర్తయిందా?' అని అడగ్గానే, వారికి ఆపుకోలేనంత దుఃఖం కలిగి, కన్నీరు నిండిన కళ్ళతో, 'అంతా ముగిసింది' అన్నారు. దగ్గర వున్న కుంజుస్వామిగారు భగవాన్తో, 'మురుగనార్ తన తల్లి అస్థికలను తీసుకొని వచ్చార'ని చెప్పగా, భగవాన్ 'మంచిదే. పక్కన వున్న అగ్నితీర్థం కూడా పవిత్రమైందే. అందులో వేయవచ్చు కదా!' అన్నారు. దానితో మురుగనార్ అలాగే చేసారు.

మురుగనార్ తమ తల్లిమీద వున్న ప్రేమను తెలుపుతూ, పద్యాలుగా వ్రాసి పాడుకొన్నారు. వుదాహరణకు: 'కీర్తి తిరువగవల్' గ్రంథంలో వున్న కవితకు తాత్పర్యం:-

"లౌకిక జీవితంలో నుంచి నా స్థితి మారడానికి ఎలాంటి అడ్డంకులు లేకుండా, మా తల్లిని తన పాదాలచెంత చేర్చుకోవడానికి ముందే, మా అమ్మ తనకు తెలియకుండానే, సహజంగా నాకు అనుమతి ఇచ్చేటట్లు చేసావు."

మురుగనార్ "శ్రీరమణ దేవమాలై" అనే తమ గ్రంథంలో, తమ తల్లి గురించి అనేక పద్యాలు వ్రాసారు. దక్షిణదేశపు తమిళ పండితుడు, భక్తుడు అయిన 'పట్టి నత్తార్' తన తల్లిని స్మరిస్తూ, హృదయం ద్రవించేటట్లుగా వ్రాసిన పాటలలాగా, వీరి పాటలు మనస్సును కరిగిస్తాయి. వీరు తమ 'శ్రీరమణ సన్నిధిమురై' అనే స్తోత్రగ్రంథాన్ని తమ తల్లిగారికే సమర్పించారు. ఈ గ్రంథంలోని ఒక అధ్యాయంలో,

"వేంకట రమణుడవైన నీ పాదకమలాల వద్దకు నన్ను చేర్చిన ఆ మాతృమూర్తికి, ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాను" అని చెప్పారు మురుగనార్. అనేక పద్యాలలో వీరు, తల్లిమీద తమకు వున్న ప్రేమను తెలుపుకున్నారు.

## అణ్ణామలైలో స్థిరనివాసం

తల్లి మరణానంతరం, మురుగనార్ మద్రాసులో చేస్తున్న వుద్యోగాన్నీ, కుటుంబాన్నీ త్యజించి, 1926వ సం|| జూలై నెలలో శ్రీఅరుణాచలానికే వచ్చి, అక్కడ స్థిరపడ్డారు. దానితో జీవితంపై వారి దృష్టి అంతా మారిపోయింది.

మొదట్లో వారు పల్లా కొత్తులోనే వుండేవారు. తిరువణ్ణామలై టౌనులో భిక్షమెత్తి భుజించేవారు. అనేక దినాలు పస్తులు కూడా వున్నారు. వీరు గొప్ప పండితులు అయి వుండి కూడా, వేదాంత గ్రంథాలను మాత్రం చదవలేదు! కావ్యాలను, వ్యాకరణాన్ని మాత్రం బాగా చదివారు. అనేక గ్రంథాలు చదవడమే కాదు, చదివినవాటిని జ్ఞాపకం వుంచుకోవడంలోనూ వీరు ప్రావీణ్యులు.

శ్రీభగవాన్ వద్ద ప్రత్యక్షంగా వేదాంతవిద్యను అభ్యసించినవారు ఇద్దరంటే ఇద్దరే. ఒకరు శ్రీమురుగనార్, మరొకరు కె. లక్ష్మణశర్మగారు. తక్కినవారు అక్కడకు రావడానికి ముందే కొంత నేర్చుకొని, ఆపైన సందేహాలు తీర్చుకొనేవారు. వీరిద్దరూ విద్యావంతులు అయినప్పటికీ, వేదాంత గ్రంథాలను చదవకుండానే భగవాన్ను చేరి, ఆ విద్యను ఎలాంటి సందేహాలు పుట్టలేని విధంగా నేర్చుకున్నారు!

వీరి గురించి జరిగిన ఒక హృద్యమైన సంఘటన, కుంజుస్వామిగారు ఇలా చెప్పారు: “మురుగనార్ వైదుష్యాన్ని గురించి తెలుసుకొన్న ఈశాన్య మఠాధిపతి, 'వారిని తమ మఠంలో వుండి, మాణిక్యవాచకుల 'తిరుచిట్రంబలక్కోవై'ను తమకు నేర్పమ'ని కోరారు. దానికి ఒప్పుకొని, మురుగనార్ ప్రతిరోజు వుదయం పాఠం చెప్పి, మధ్యాహ్నానికి ఆశ్రమానికి వచ్చేవారు.

గిరిమీద వున్న “గుహనమశ్శివాయర్" మఠంలో నివసిస్తున్న 'సాధు నటనానంద', పడమటి దిక్కు గోపురం దగ్గర మురుగనార్ను కలిసి ఇద్దరూ ఆశ్రమానికి వచ్చేవారు. ఒకరోజు ఒక పద్యంలోని పూర్వభాగంలో నాలుగు వరుసల్ని, మురుగనార్ ఎంతో ప్రయత్నించీ చెప్పలేకపోయారు. దారిలో కలిసిన నటనానందులు అది తెలిసి, దానిని పూర్తి చేసారు. ఆశ్రమానికి వచ్చాక ఆ పద్యాన్ని భగవాన్కు చూపించి, జరిగిన విషయం తెలిపారు. దానికి నవ్వుతూ భగవాన్ నటనానందులతో, "రేపు మీరు నాలుగు వరుసలు వ్రాయండి, మిగతావి వారు వ్రాస్తే సరిపోతుంది” అన్నారు.

దాని ప్రకారంగానే, మర్నాడు నటనానందులు మొదటి నాలుగు వరుసలు వ్రాయగా, మిగతావాటిని మురుగనార్ పూర్తిచేసి భగవాన్కు చూపించారు. దానిని చూసి భగవాన్ 'ఫరవాలేదే! ఇద్దరూ పండితులు. మొదటి పద్యానికి 'మురుగనటనులు' అనీ, రెండవదానికి 'నటనమురుగర్' అనీ పెడితే సరిపోతుంది' అని హాస్యంగా చెప్పార”ని కుంజుస్వామి తెలిపారు.

"భిక్ష చేసి తింటేనే 'తాను' అనే అహంకారం అణిగి, దేహాత్మభావం నశిస్తుంద"నీ భగవాన్ తరచు చెప్పేవారు. 'అందుచేత తాము కూడా భిక్ష చేసే తినాల'ని మురుగనార్ తలచి, ఒక తెల్లటి గుడ్డను జోలెలాగా భుజానికి తగిలించుకొని, టౌనుకు వెళ్ళి భిక్షమెత్తేవారు. అలా తెచ్చుకున్న భిక్షను, పల్లాకొత్తు చెరువు గట్టున పెట్టి, నీళ్ళలో దిగి కాళ్ళూచేతులు కడుక్కున్న తరువాత వచ్చి దానిని తినేవారు.

మురుగనార్ ఎంతో శుచిమంతుడు. వారు భిక్ష తీసుకొనే వస్త్రాన్ని చూస్తే, అది తెల్లగా వుండి, అందులో భిక్ష వేయడానికి జంకేట్లుగా వుండేది. అది అంత తెల్లగా, శుభ్రంగా వుండేది.

ఒక్కొక్కసారి మురుగనార్ భిక్షను చెరువుగట్టున పెట్టి, చెరువులోకి దిగి కాళ్ళూ చేతులు దీర్ఘకాలం మట్టిపెట్టి తోముతూ కడుక్కుంటుంటే; 'పల్లాకొత్తు సొంతదారులా!' అనిపించే కోతులు కొన్ని, గట్టుమీద వారు పెట్టుకొన్న భిక్షాన్నాన్ని తిని వెళ్ళిపోయేవి. వీరు నెమ్మదిగా కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చి, అన్నం తిందామని చూసేటప్పటికి, అక్కడ వట్టి గుడ్డ మాత్రమే వుండేది! ఇక ఆ రోజు కటిక వుపవాసమే మరి. ఇలా అనేకసార్లు జరిగింది. ఈ దయనీయ స్థితిని ఒకసారి స్వయంగా చూసిన పల్లాకొత్తు వినాయకుని గుడి అర్చకులు అయిన 'సభాపతి పిళ్ళై', "మురుగనార్ను తన గదిలో వుండమంటూ, తాను గుడిలోనే వుంటాన"ని చెప్పి, ఆయనను తన గదిలో వుంచారు. ఇలా మురుగనార్ పల్లాకొత్తు నివాసం ప్రారంభమైంది.

## మురుగనార్-పల్లాకొత్తునివాసం

## (ఆధ్యాత్మికనివాసం)

మురుగనార్ పల్లాకొత్తులో వుంటున్న రోజుల్లో, అక్కడ కుంజుస్వామి, మునగాల వెంకట్రామయ్య, విశ్వనాథస్వామి, రామనాథ బ్రహ్మచారి, రామ సుబ్బయ్యర్ గార్లు కూడా నివసిస్తుండేవారు. అందరూ భగవాన్ భక్తులే కావడంచేత, ఆ స్థలం ఎంతో పవిత్రంగా వెలుగొందింది. కుంజుస్వామి, 'ఈ పల్లాకొత్తులో వున్న స్వర్ణదినాలు మరువలేనివి' అని అంటుండేవారు.

శ్రీభగవాన్ భక్తులు, వారి వుపదేశమైన 'విచార మార్గాన్ని' అనుష్ఠిస్తూ, తరువాత ఆచరించేది 'గిరిప్రదక్షిణం'. "గిరిప్రదక్షిణం" అనేది ఆత్మోపలబ్ధికి అత్యంత వున్నత సాధనం అనేది అందరికీ అనుభవంలో వున్న విషయమే.

దీనికోసం మురుగనార్ ఒక మండలం (40 రోజులు) ప్రదక్షిణ చేసారు. సాధారణంగా మురుగనార్కు దేనినీ చెప్పే అలవాటు లేదు. అందులోనూ తన అనుభవాన్ని అయితే, కొంచెం కూడా చెప్పుకోరు. అలాంటిది వారు ఒక ఆశ్చర్యకరమైన అనుభవాన్ని చెప్పారు: "వారు గిరిప్రదక్షిణ చేస్తున్నపుడు, నైరుతి లింగం నుండి ఆడి అణ్ణామలై చేరేదాకా, వారికి దేహప్రజ్ఞయే వుండేది కాదు" అని (అంతమాత్రంగా) చెప్పి, దానికి ఆశ్చర్యపడేవారు.

## శ్రీరమణ సన్నిధిమురై - గ్రంథ రచన

శ్రీమురుగనార్ శ్రీఅరుణాచలంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నాక, అపుడపుడు కొన్ని పాటలను రచించి, భగవాన్కు ఇవ్వడం అలవాటు. అలా రూపొందిందే "శ్రీరమణ సన్నిధిమురై" అనే అపురూపమైన స్తోత్ర గ్రంథం. ఇది రూపొందడానికి విశిష్టమైన కారణం వుంది. భగవాన్ కాలంలోనే అనేకమంది భక్తులు, ఈ గ్రంథంలోని పద్యాలను మననం చేసుకొంటూ, సన్నిధిలో పాడుతూ వుండేవారు.

మురుగనార్ హృదయంలో శ్రీభగవానులే వుండి, ఈ గ్రంథాన్ని రచింపచేసారని చెప్పాలి. ఈ రచనలో నాయకుడు రమణ ప్రభువు. మరి గ్రంథ రచయిత ఏమో, రమణులచేత వశీకరింపబడి, వారి కృపాదృష్టిలో సేద తీర్చుకున్నవాడు. 'భగవాన్న

తప్ప ఏ ఇతర దైవాన్ని స్తుతింపను' అనే వ్రతశీలుడు. తన నాలుకతో శ్రీభగవాన్నే స్తుతించడానికి కంకణం కట్టుకొన్నవాడు.

మురుగనార్కు తమిళ భాషమీద ఎంతో భక్తి. ఆ భాషలో పాండిత్యం వున్నవాడు. అనేక అరుదైన తమిళ గ్రంథాలను, కావ్యాలను, వ్యాకరణాన్ని కూలంకషంగా అధ్యయనం చేసినవాడు. విద్వాంసుడైన ఈ భక్తుడు, భగవాన్ను ఎపుడు దర్శించినా నిశ్చేష్టుడై నిలుచుండేవాడు. భగవాన్ ఈ భక్తునిద్వారా తమ సన్నిధిమురైను రచింపచేసారు. ఆదిపురుషుడు అనుకొంటే, కాని పని అంటూ ఒకటి వుంటుందా! “సన్నిధిమురై" అంటే, భగవంతుని సన్నిధిలో తమ మనస్సులోని చింతలను, బాధలను పోగొట్టుకోవడంకోసం భగవంతునితో మొరపెట్టుకోవడం, ప్రార్థించడం అని భావం. 'భగవంతుని ఎలా స్తుతించడం' అనే పద్ధతినీ, క్రమాన్నీ తెలిపే గ్రంథం అని కూడా చెప్పవచ్చును.

పరమేశ్వరుణ్ణి స్తుతిస్తూ పాడిన భక్తుల పాటలను క్రోడీకరించి, “పన్నెండు తిరుమురై”లుగా విభజించారు. (దక్షిణ దేశ శైవ గ్రంథాలు పన్నెండు. వాటిలో శ్రీసంబంధమూర్తి, అప్పర్, మాణిక్య వాచకులు, తిరుమూలర్, తొగై యడియార్, శేక్కిపార్ మొదలైనవారి గ్రంథాలు వున్నాయి.) దక్షిణదేశంలో శివస్తోత్ర సంప్రదాయాలలో ఈ “ద్వాదశ తిరుమురై"లు ఎంతో వున్నత స్థానాన్ని పొంది, భక్తి వరదలై పారేటట్లుగా చేయడంచేత, అవి భక్తుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయాయి.

తమిళ దేశంలోని కొన్ని దివ్య క్షేత్రాలలో “సన్నిధిమురై" అనే ప్రత్యేకమైన స్తోత్ర గ్రంథం, పారాయణ సంప్రదాయంలో వుండి ప్రసిద్ధి చెందింది. ఇలా 'సన్నిధిమురై' ప్రాచీన కాలం నుండే పాడడం ఆచారంలో వుంది. ఇటీవల కాలంలో 'చిదంబరస్వామి' అనే తపోధనులు, “తిరుప్పోరూర్ సన్నిధిమురై” అనే చక్కని గ్రంథాన్ని రచించారు. కానీ, ఈ 'శ్రీరమణ సన్నిధిమురై' అనే స్తోత్ర గ్రంథానికి ఒక ప్రత్యేకత వుంది. 'ద్వాదశ తిరుమురై' గ్రంథంలో అనేక భక్త శిఖామణులు పాడినవాటిని 'ఒక అధ్యాయాల మాలగా, పన్నెండు దివ్యక్రమాలుగా' విభజించారు. కానీ, 'శ్రీరమణ సన్నిధిమురై' అనే గ్రంథంలో పన్నెండవ తిరుమురై (దివ్యక్రమం) తప్ప, తక్కిన పదకొండు తిరుమురైలూ మురుగనార్ ఒక్కరే రచించారు.

ఇంతేగాక, 'ద్వాదశ తిరుమురై'లో లేని కొన్ని ప్రబంధాలను, ఇందులో వీరు రచించారు. 'నేత్రాలతోటే అనుగ్రహ వర్షాన్ని కురిపించే భగవాన్ గురించి, భగవాన్యొక్క అనుగ్రహ దృష్టిని గురించి పాడిన దశకం', వీటన్నిటికీ మకుటాయమానమై ఎంతో మధురమైనదిగా నిలిచిపోయింది. నయనదీక్షకు మూలమైన భగవాన్యొక్క అనుగ్రహంతో కూడుకొన్న దృష్టిద్వారా, కరుణ కట్టలు తెంచుకొని పొంగి పారడాన్ని మనం ఈ రచనలో చూస్తాం.

భగవాన్ తమ భక్తులకు ఇచ్చే ఈ 'నయనదీక్ష' అనే అనుగ్రహ దృష్టి చాలా శక్తివంతమైంది. ఈ అనుగ్రహ దృష్టినుంచి ఎవరూ తప్పించుకోలేరు. తప్పించు కోవడానికి వీలు కూడా కాదు. ఈ అనుగ్రహ దృష్టి పడ్డంత మాత్రంలోనే, భక్తుల కర్మ ఫలితాలు నశించిపోతాయి.

భగవాన్ గిరిమీద నివసిస్తున్న రోజుల నుంచి అనేకమంది భక్తులు, భగవాన్ను స్తుతిస్తూ అనేక పద్యాలు వ్రాసారు. ఆ తమిళ పద్యాలు అటు పాడినవారినీ, ఇటు విన్నవారినీ భక్తి పారవశ్యంలో ముంచుతూ, హృదయం వుప్పొంగింపచేస్తూ, దైవంతో ఏకమయ్యేటట్లు చేయగలంత శక్తివంతమైనవి. శ్రీభగవాన్ గిరిపై నుంచి క్రిందకు వచ్చి వుండడం వలన 'శ్రీరమణాశ్రమము' రూపొందింది. శ్రీమురుగనార్ వచ్చింది అపుడు. మురుగనార్ అపుడపుడు వ్రాసిన కొన్ని పాటలు 'శ్రీరమణ సన్నిధిమురై' అనే వుత్తమ గ్రంథంగా రూపొందాయి. ఒకసారి ఆయన ఒక ప్రభాత గీతం వ్రాసి భగవాన్కు ఇచ్చారు. ఆ పద్యాన్ని చదివి భగవాన్, "తిరువాచకంలాగ వ్రాయగలరా? ఇలాగే వ్రాస్తే అది తిరువాచకంలాగ అవుతుంది" అన్నారు.

భగవాన్ మాటలకు మురుగనార్ నిశ్చేష్టులయ్యారు. “తిరువాచకం' రచించిన మాణిక్యవాచకులు ఎక్కడ? మూఢమతి అయిన తాను ఎక్కడ? పూర్వం స్థలవృక్షం క్రింద కూర్చున్న మాణిక్య వాచకరులను ఆవహించిన పరమశివుడే, ఇపుడు తనను వ్రాయమని చెప్పిన భగవాన్ గా, అరుణాచలం నుంచి అనుగ్రహిస్తున్నాడు. స్వల్పబుద్ధి గల తాను నిజంగా ఆ

విధంగా వ్రాయగలడా? మిణుగురు పురుగు సూర్యుడితో పోటీ పడగలదా? అనుభూతిపరుడైన మాణిక్య వాచకరులవలె నేను వ్రాయగలనా?" అని వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నారు.

ఇదంతా వింటున్న భగవాన్, తమ నయనాలతో మురుగనార్పై అనుగ్రహాన్ని ప్రసరించగా, మురుగనార్ పద్య రచన మొదలుపెట్టి అనేక పదికములను వ్రాసి, రాశులుగా పోసారు. ఇలా వీరు పదికములను వ్రాస్తుండగా చూసిన ఒక భక్తుడు మురుగనార్తో, "మీరు రచిస్తున్న పదికములను, ఒక పద్ధతితో సన్నిధి క్రమంగా (సన్నిధిమురై) వ్రాయాలని కోరారు.

అలా 'శ్రీసన్నిధిమురై' అనే అరుదైన గ్రంథం రూపొందింది. "భగవాన్ తనను ఒక పనిముట్టుగా ఎంచుకొని, 'సన్నిధిమురై'ని రచించారా"ని మురుగనార్ అనేక పద్యాలలో తెలిపారు.

'భగవాన్ నేత్రాలలో పొంగిపొరలుతున్న అనుగ్రహం, ఎలా వారిని భక్తి శిఖరారోహణం చేయించింది' అనేదానిని ఈ ఘటన తెలుపుతుంది. భగవాన్ భక్తులకు ఇది అనుభవంలోని విషయమే. ఒక పద్యంలో మురుగనార్ 'భగవానుని అనుగ్రహ కటాక్షవీక్షణం, ఒక అనంత నేత్రంలా ప్రకాశిస్తున్నద'ని చక్కగా వివరించారు. ఈ గ్రంథాన్ని మొదటగా శ్రీరమణ పాదానందులు 1933వ సంవత్సరంలో ప్రచురించారు.

'శ్రీరమణ సన్నిధిమురై' మొదటి ప్రచురణలో 'రమణ పురాణం' లేదు. ఈ గ్రంథం 'తిరువాచకాన్ని అనుసరించి రచించిన స్తోత్రగ్రంథం. కాబట్టి, తిరువాచకంలో వున్నట్లుగా, ఇందులో కూడా 'శివపురాణం' అనే భాగం వుండాలి. అందుచేత మురుగనార్ ఆ భాగాన్ని రచించి, అందులో చేర్చాలని వ్రాయడం మొదలుపెట్టి, సుమారు రెండు వందల పంక్తులకు పైన వ్రాసాక, 'దానికి ఏమి శీర్షిక పెట్టాలి?' అనే ఆలోచన కలిగింది. శైవులకు 'శివపురాణం' అనే పేరే మిక్కిలి పవిత్రం కాబట్టి, ఆ పేరే వుండాలి. అంతే కాకుండా 'తిరువాచకం నాయకుడు ఈశ్వరుడు' కావడం వలన ఆ భాగానికి 'శివపురాణం' అనే శీర్షికే వుచితం. కానీ, 'శ్రీరమణ సన్నిధిమురై'లో నాయకుడు రమణేశ్వరుడు కాబట్టి, 'రమణ పురాణం' అనేదే తగిన శీర్షిక. మరేం చేయాలి? ఈ సందిగ్ధావస్థలో తక్కినవి వ్రాయడం ఆపి, వ్రాసిన కాగితాలను భగవాన్ పాదాలకు సమర్పించి, మురుగనార్ బయటికి వెళ్ళిపోయారు.

తిరిగి మురుగనార్ సాయంకాలం వచ్చినపుడు భగవాన్ వారిని చూడగానే, పొద్దున్న ఆయన ఇచ్చిన కాగితాలను ఆయనకే ఇచ్చేసి, "వాటిని చూడమ"ని చెప్పారు. ఆ కాగితాలను చదివిన మురుగనార్ ఆశ్చర్యంలో మునిగిపోయారు. దానికి కారణం, 'మురుగనార్ సమర్పించిన పద్యాలకు తామే అందులో 'రమణ పురాణం' అని శీర్షిక పెట్టి వ్రాయడం. అంతేగాకుండా దానితోపాటు 300 పైబడిన పంక్తులను తామే వ్రాసి, భగవాన్ ముగించడం.' ఆ కాగితాలకు ఒక్కొక్క పక్కన 'రమణ పురాణం' అనే శీర్షిక కూడా వారు వ్రాసారు. అడగకుండానే అడిగిన శిష్యునికి సమాధానంగా, వారు ఇలా ఆ రమణ పురాణాన్ని తామే రచించి పూర్తి చేసి ఇచ్చారు.

'శ్రీరమణ సన్నిధిమురై' రెండవ ముద్రణలో ఈ 'రమణ పురాణము'ను చేర్చారు. ముద్రిస్తున్నపుడు ప్రూఫ్ రాగా, మురుగనార్ దానిని సవరిస్తూ 'ఎంతదాకా తాను రచించిందీ, భగవాన్ ఎక్కడ నుండి తాము రచించి అనుగ్రహించిందీ' సూచిస్తూ, ఒక గుర్తును వుంచారు. అంటే, పేజీ క్రింద పాదపీఠికలో ఈ పంక్తి నుండి భగవాన్ రచించారన్న మాట. తాను తప్పులు దిద్దాక, భగవాన కు ఇచ్చి 'చూడమ'ని మురుగనార్ వేడుకొన్నారు. ఆ ప్రూఫ్లు చూస్తున్నపుడు, భగవాన్కు పాదపీఠికలోని ఈ వివరణ కనిపించింది. అది చదివిన భగవాన్ "ఓహో! ఇవి మాత్రమే భగవాన్ వ్రాసినవా?" అని అడిగారు. అది విన్న తక్షణమే మురుగనార్ నిశ్చేష్టుడై, కన్నీరు నిండినవాడై సాష్టాంగ నమస్కారం చేసి, "భగవాన్ నేను ఏదీ వ్రాయలేదు. అంతా తమ అనుగ్రహ లీలే" అని కన్నీరుమున్నీరుగా విలపించారు. తరువాత, పుట క్రింద ఇచ్చిన వివరణలను తీసివేసారు.

దీని వలన తెలిసిందేమిటి? నిస్సందేహంగా, ఈ 'రమణ సన్నిధిమురై' అనే గ్రంథం, భగవాన్ రచించిన గొప్ప కావ్యం అని! 1851 చక్కటి తమిళ పద్యాలు గల ఈ గ్రంథం, మహోన్నతమైన భక్తిని చాటుతూ హృదయాన్ని ద్రవింప చేస్తుంది. శ్రీకృష్ణ భగవానుడు అనుగ్రహించిన 'భగవద్గీత' అనే గ్రంథం, మహాభారత మధ్య భాగంలో ఎలా వుందో; అలా 'శ్రీరమణ

సన్నిధిముర్రై' అనే ఈ గ్రంథం మధ్యలో, శ్రీభగవాన్ అనుగ్రహించిన “తిరువుందీయర్” అనే అరుదైన వుపదేశసార గ్రంథం ఇమిడి వుంది. జ్ఞాననిధి అయిన ఈ “ఉపదేశసారం” అనే గ్రంథాన్ని, విడిగా భగవాన్ ఒక గ్రంథంగా రచించారు కూడా. సకల వుపనిషత్తుల సారంగా ఈ 'ఉపదేశసార' భాగం ఇందులో జ్యోతిర్మయంగా ప్రకాశిస్తోంది. శ్రీభగవాన్ ‘ఉపదేశసారము'ను రచించడానికి, మురుగనార్ కారకుడు.

శ్రీరమణ సన్నిధిముర్రైకి మరొక గొప్పతనాన్ని కూడా కలిగించారు. 'ఆ గ్రంథం తిరువాచకమునకు దీటుగా రచింపబడింద'ని ఆమోదముద్ర వేస్తూ, ఒక పద్యాన్ని వ్రాసి ఇవ్వడమే అది.

ఒకసారి భగవాన్ వున్న హాల్లో విశ్వనాథస్వామి, అక్కడే కూర్చున్న మురుగనార్ను చూసి, "ముగవాపురి మురుగ, ముగవాపురి మురుగ” అని అంటున్నారు. మురుగనార్, 'సుబ్రహ్మణ్యం' అనే తమ సంస్కృత నామాన్ని, 'రామనాథపురం' అనే తమ జన్మస్థలాన్ని కలిపి "ముగవాపురి మురుగన్” అని తమిళభాషలోకి మార్చారు. దీనినే అపుడు విశ్వనాథస్వామి పరిహాసంగా, మురుగనార్ తో నవ్వుతూ అన్నారన్న మాట.

దీనిని విన్న భగవాన్, విశ్వనాథస్వామితో “నీవు ఇపుడు చెప్పిన ఆ పదాలతో ఒక పద్యం ఎందుకు వ్రాయకూడదు?" అన్నారు. భగవాన్ అలా అన్న వెంటనే, విశ్వనాథస్వామి పద్యం వ్రాయడం మొదలుపెట్టారుగానీ, ఆ పదాలతో పద్యం వ్రాయలేకపోయారు. దాంతో 'ముగవాపురి మురుగన్' అని వ్రాసిన కాగితాన్ని భగవాన్కే ఇచ్చి వెళ్ళిపోయారు. అయితే, భగవాన్ ఆ పదాలను ఇమిడ్చి ఒక చక్కటి పద్యాన్ని వ్రాసి, ఆ పద్యం క్రింద 'విశ్వనాథన్' అని కూడా వ్రాసారు. ఆ పద్యంలో 'ముగవాపురి మురుగన్' అనే మాటలు తప్ప, మిగిలిందంతా భగవానే వ్రాసారు. ఆ పద్యభావం ఈ క్రింది విధంగా వుంది:

"హృదయ కమలంలో ప్రకాశిస్తున్న అరుణాచల రమణుడు చిరునవ్వు చిందిస్తూ తీక్షణంగా చూసి, నా అహాన్ని పూర్తిగా నశింపచేసి, ఆ తరువాత అపరిమితమైన అనుగ్రహాన్ని కురిపించాడు. 'ముగవాపురి మురుగన్' లోకంలోని జీవులు తరించడంకోసం, 'సన్నిధిముర్రై'ను 'తిరువాచకాని'కి సరిసమానంగా రచించాడు."

ఈ గ్రంథాన్ని రమణానందులు, 1939వ సం॥ ఏప్రిల్ నెలలో రెండవ ముద్రణగా ప్రచురించారు.

## ‘ఉన్నది నలుబది' గ్రంథాన్ని శ్రీభగవాన్ రచించడం

శ్రీరమణ భగవాన్, సాధారణంగా మౌనంగానే వుండేవారు. ‘సంకల్ప రహితుడైన భగవాననున్ను ప్రార్థిస్తే తప్ప, ఏదీ దొరకదు' అని తెలుసుకున్న మురుగనార్, భగవాన్ అపుడపుడు రచించిన 21 పద్యాలను సేకరించి, 'వాటినే ఒక గ్రంథంగా కూర్చవచ్చు' అనుకొన్నారు. దాని ప్రకారం, ఆ పద్యాల భావం ఒకదానికి ఒకటి పొసగేటట్లు, మరికొన్ని భావాలను చేర్చాలన్న ఊహ వారికి వచ్చింది. దీనికోసం వారు భగవాన్తో "భగవాన్! సద్వస్తువుయొక్క సత్యాన్నీ, దానిని పొందే మార్గాన్నీ తెలుపుతూ, భక్తులకు సహాయపడేటట్లుగా ఇంకా కొన్ని పద్యాలను రచించి; ఇదివరకు వున్న 21 పద్యాలతో వీటిని చేర్చి, 40 పద్యాలు వున్న ఒక గ్రంథంగా అనుగ్రహించండి" అని వేడుకొన్నారు.

సంగకాలపు తమిళ కావ్యాలలో 'చేయించిరి నలుబది (ఇన్నా నార్పదు), చేయవలసినవి నలుబది (ఇనియ నార్పదు), వర్షమును గురించి నలుబది (కార్ నార్పదు), అంతిమమార్గం నలుబది (ఖళవషి నార్పదు)' వంటి గ్రంథాలు వున్నాయి. ఆ రోజుల్లో పద్యాల సంఖ్యనే, గ్రంథానికి పేరుగా నిర్ణయించి పెట్టేవారు. దీనిని మనస్సులో వుంచుకొన్న మురుగనార్, 'భగవాన్ రచించిన పద్యాలను నలభైకి పైగా కూర్చి, ప్రాచీన సంప్రదాయానుసారంగా దానికి "ఉన్నది నలుబది” అనే శీర్షికను ఇచ్చి, దానిని ఒక సంపూర్ణ జ్ఞానగ్రంథంగా రూపొందించాల'ని అనుకొన్నారు. వారి ఆ సంకల్పం సిద్ధించింది కూడా.

మురుగనార్ కోరికను మన్నించి, శ్రీభగవాన్ అపుడపుడు ఒకటి, రెండు పద్యాలను పూనుకొని వ్రాయగా, మురుగనార్ కూడా భావానికి తగినట్లుగా వాటిని ఒక వరుస క్రమంలో పెట్టారు. శ్రీభగవాన్ క్రొత్తగా రచించిన పద్యాల్లోని అద్వైత

వుపదేశాలు సరిపోకుండా వున్న పాత పద్యాలను, ఒక్కొక్కదానిని వేరు చేయాల్సి వచ్చింది. క్రొత్త పద్యాల భావానికి కొన్ని పద్యాలు పొంతన కుదరక పోవడం వలన, వాటిని కూడా పక్కకు పెట్టాల్సి వచ్చింది.

అందుచేత, మురుగనార్ "ఆ పద్యాలను పరిశీలించి, సవరించమ"ని భగవాన్ను ప్రార్థించారు. ఇలా క్రొత్త పద్యాల భావం చక్కగా అమరడంకోసం, దాదాపు పాతవాటిని అన్నిటిని తీసివేయాల్సి వచ్చింది. కొత్త పద్యాలను, పాత పద్యాలను విడదీయడంలో శ్రీభగవానూ, మురుగనారూ కొంతకాలం నిమగ్నులై వున్నారు. 'ఈ రమణోపదేశ జ్ఞానోపనిషత్తును, నలభై వెణ్బాలకు ఒక మంగళ వెణ్బాను కూడా జత చేసి, ఇరవై రోజులలో రూపొందించారు. శ్రీకావ్యకంఠ గణపతి మునుల కోరికను అనుసరించి, శ్రీభగవాన్ దీనికోసం మరొక వెణ్బాను కూడా రచించారు. అంటే ఈ గ్రంథంలో రెండు మంగళ వెణాలు వున్నాయన్న మాట. ఇలా అద్వైత శిఖరమైన 'ఉన్నది నలుబది' అనే గ్రంథాన్ని శ్రీభగవాన్ అనుగ్రహించారు.

1928వ సం|| ఆగష్టు నెలలో ఈ రచన పూర్తి కాగా, 1931వ సం॥లో దీనిని నిరంజనానంద స్వామి ప్రచురించారు. 21 పాత పద్యాలతో ప్రారంభించి, '40 సంఖ్యకు కావలసిన పద్యాలను రచించి అనుగ్రహించమ'ని వేడుకొన్న మురుగనార్గారికి; అనుగ్రహకవి అయిన ఋషి పుంగవులు శ్రీరమణులు అన్నీ కొత్తవే అయిన 40 పద్యాలను, మంగళ వెణ్బాలతో కూడా రచించి ఇచ్చారు.

'ఉన్నది నలుబదిలో చోటు చేసుకొని ఆ 21 పద్యాలను, "ఉన్నది నలుబది అనుబంధం" అనే పేరుతో తరువాత భాగంగా కూర్చాల'ని మురుగనార్ ప్రార్థించడం చేత, శ్రీభగవాన్ కూడా దానికి సమ్మతించి అలాగే చేసారు. 1928వ సం||లో 21 పద్యాలు వున్న అనుబంధం, భగవాన్ తరువాత రచించిన 9 పద్యాలతో, 1931 సం॥ నాటికి 30 పద్యాలు కలిగింది అయింది. మరల 1938వ సం||లో 7 పద్యాలు, 1940వ సం||లో మరో 4 పద్యాలు భగవాన్ రచించగా, వాటిని ఈ అనుబంధంలో చేర్చారు. మొత్తం ఈ గ్రంథం మంగళ వెణ్బాలతో కూడి నలభై ఒక్క పద్యాలతో ప్రస్తుతం వున్న, "ఉన్నది నలుబది అనుబంధం"గా రూపొందింది.

శ్రీమురుగనార్ శ్రీభగవాన్ను ఆశ్రయించి, 'సద్వస్తు లక్షణాన్నీ, దానిని పొందగలిగే మార్గాన్నీ, తాము తరించేటట్లుగా తమకు అనుగ్రహించమ'నీ ప్రార్థిస్తే; భగవాన్ శ్రీరమణులు అసత్య ప్రపంచపు మోహాంధకారం పూర్తిగా తొలగిన జ్ఞానానుభూతిని పొందినవారు కావడం వలన 'ఉన్నది నలుబది' అనే జ్ఞానానుభవ గ్రంథాన్ని రచించి అనుగ్రహించారు. శ్రీకృష్ణభగవాన్ నుంచి శ్రీమద్భగవద్గీత రావడానికి అర్జునుడు కారణమైనట్లుగా; ఆదిదేవుడూ, సంపూర్ణమౌని అయిన శ్రీరమణ భగవాన్ నుంచి సకల ఉపనిషత్ సారమైన 'ఉన్నది నలుబది' అనే జ్ఞానగ్రంథం వుద్భవించడానికి శ్రీమురుగనార్ కారకులయ్యారు. తమకు తాముగా ఏదీ రచించని భగవానుని వ్రాయడానికి పురిగొల్పి, తరతరాల రమణ భక్తులకు ఒక జ్ఞానభాండాగారాన్నీ, తరగని మూట అయిన ఒక పెన్నిధినీ శ్రీభగవాన్ నుంచి పొందారు.

'ఉన్నది నలుబది' వున్నంతవరకు, భక్తుల హృదయాలలో మురుగనార్కు కూడా స్థానం వుంటుంది. కుండలోని దీపంలాగ - సామాన్యంగా, వీలైనంత వరకు ఎవరికీ కనిపించకుండా, అజ్ఞాతంగా జీవించిన ఈ సామాన్య భక్తుని జ్ఞానాన్నీ, అనుభవాన్నీ తెలుసుకోవాలంటే; వారు రచించిన అనేకవేల పద్యాలు వున్న గ్రంథాలే శరణ్యం.

ఏదైనా వ్రాత పనులకు మనిషి కావలసి వస్తే, భగవాన్ హాలులో మురుగనార్ వుండే వైపుకు వెతుకుతూ చూసేవారు. కానీ, మురుగనార్ ఆ చోట కూర్చుని, భగవాన్ను తన చూపులతోనే గ్రోలుతూ, తనను తాను మరచిపోయి వుండేవారు. ఆయన దేనికీ ముందు వుండి చేయడానికి సిద్ధపడేవారు కాదు. శ్రీభగవాను నీడలా వెన్నంటి వున్న ఈ భక్తుని శ్రేష్ఠ గుణాలు ఇవి.

## తిరు ఉందియర్

'తిరు ఉందియర్' గ్రంథంలో మురుగనార్, శ్రీభగవాన్పై తమకు ఏర్పడిన ఏకాగ్రభక్తిని తెలిపారు. వారు జీవితంలో భగవాన్ను చూసిన తక్షణం, వారిపై భక్తి వేళ్ళూనింది. శివలీలలు అన్నింటినీ 'రమణ లీలలు'గానే భావించి, వారి మనస్సు ఆనందించింది. 'శ్రీరమణ సన్నిధిమురై' గ్రంథాన్ని 'తిరువాచకం'లాగా రచించినపుడు, శివుని అనుగ్రహ

లీలల్నేగాక; వినాయకుడు, బ్రహ్మ, విష్ణువు, సుబ్రహ్మణ్య, రామకృష్ణాది అవతార పురుషులందరూ చేసిన లీలల్ని 'శ్రీరమణ మహర్షి లీలలు'గానే భావించి వీరు రచించారు.

ఇందులోని పద్యాలన్నింటినీ మురుగనార్ "ఉందియర్" (వేదాంత గ్రంథం)గా రచించారు. ఇందులో, హైందవ దేవతలేగాక బుద్ధుడు, క్రీస్తు మొదలైన మతస్థాపకుల లీలల్ని కూడా, 'అవి శ్రీరమణులు చేసినవే' అనే సర్వమత సామరస్య దృష్టితో చూసారు.

శివలీలల్ని రచిస్తున్నపుడు, చిట్టచివర 'తాపసులకు తెలియజేయడం' అనే శీర్షిక క్రింద; దారుకావనంలో యజ్ఞయాగాదుల్ని చేస్తున్న కర్మిష్టులైన తాపసుల్ని అడ్డగించడంకోసం, శివుడు చేసిన లీలలను రచించే ఘట్టంలోని ఒక పద్యంలో 'తపస్వుల గర్వాన్ని' వివరించారు. 'కర్మాచరణలో వారికి వున్న పట్టుదలను సడలించి, వారి ప్రయత్నాలన్నీ విఫలమూ, నిర్వీర్యమూ అయ్యేటట్లు చేస్తూ, దైవాన్ని దూషించి చేసిన కర్మఫలితాలను తెలుసుకొనేటట్లుగా', ఈశ్వరుడు వారిని అడ్డగించడం ద్వారా చేసాడు. శివానుగ్రహంతో ఆ తపస్వుల గర్వం నశించగా, వారంతా తల వంచి ఈశ్వర పదాలకు వినమ్రంగా మ్రొక్కి, "తమ దోషాలను మన్నించి, తమను కాపాడమని వేడుకున్నారు.

ఇక్కడిదాకా వ్రాసాక, ఇక శివుడు వారిని అనుగ్రహించి వుపదేశించే ఘట్టం రాగా, "ఆ శివోపదేశాన్ని శ్రీభగవానే వ్రాయాల"ని ప్రార్థించారు. "అప్పటిదాకా తాను వ్రాస్తున్న ఛందస్సులోనే, దానిని అనుగ్రహించాల"ని కూడా అర్థించారు!

శ్రీభగవాన్ కూడా వారు అడిగిన 'ఉందియర్ ఛందస్సు'లోనే శివోపదేశాన్ని రచించి అనుగ్రహించారు. ఇలా రూపొందిన ఈ 'ఉందియర్' అనే వుపదేశ గ్రంథం 'శ్రీరమణ సన్నిధిమురై' మధ్యభాగంలో, ఒక మాణిక్యంలాగా వెలుగుతున్న వుపదేశమణి.

## గురువాచక కోవై (గురుబోధ మాల)

మూర్తీభవించిన అనుగ్రహ స్వరూపమే 'శ్రీభగవాన్.' వారి సన్నిధిలో, వారి హృదయం నుండి ఎంతో సహజంగా, సదా అనుగ్రహం ప్రవాహంలాగా పొంగి పొరలుతుంటుంది. కానీ, ఇలా నిరంతరం ప్రవహించే అనుగ్రహ రహస్యాన్ని గ్రహించలేని భక్తులు, భగవాన్ను "ఆత్మస్వరూప లక్షణాన్నీ, దానిని పొందే వుపాయాన్నీ వాగ్రూపంగా వుపదేశించమ"ని ప్రార్థిస్తుండేవారు. దానికి శ్రీభగవాన్, "ఆత్మను పొందే మార్గాలు అనేకమైనా, వాటి ముగింపు ఒక్కటే. కారణం సాధనలన్నీ కూడా, సాధన చేసే కర్తనే ఆశ్రయించి వున్నవి. కర్త అయినవాడు, 'తాను ఎవరో తెలుసుకోవడమే' అత్యంత శ్రేష్ఠమైన వుపాయం. అందువలన, ఎవరు ఏ మార్గాన్ని అనుష్టించినప్పటికీ, ఫలితం స్వరూపప్రాప్తియే" అని బదులిస్తుండేవారు.

ఈ విధంగా భగవాన్ భక్తుల సందేహాలకు అనేక సందర్భాలలో, ఆయా ప్రశ్నలకు సమాధానాలు చెపుతున్నట్లుగా తోచినప్పటికీ, 'అది శ్రీరమణుల సిద్ధాంతమైన నిజస్వరూప గ్రహణ సాధనకు చేర్చేటట్లుగానే' ముగిసేది.

శ్రీభగవాన్ భక్తులు ఏ భాషలో సందేహాలను అడిగినప్పటికీ, వారి సమాధానం మాత్రం, వారి మాతృభాష అయిన తమిళంలోనే వుండేది. ఎలాంటి పరిభాషలతో మరుగుపరిచి చెప్పకుండా, తమ అనుభవంలో నుంచే వారికి తమిళంలోనే సమాధానం దొరికేది. ఇది తమిళం మాట్లాడే ప్రజల మహాభాగ్యం.

ఇలా ప్రతిరోజూ భగవాన్ ముఖతః వెలువడిన అరుదైన వుపదేశ రత్నాలను ఒక్కొక్కదానిని స్వచ్ఛమైన, మధురమైన తమిళ పద్యాలుగా మురుగనార్ రచించేవారు. ఆ తరువాత వాటిని భగవాన్కు ఇచ్చి, 'ఆ వుపదేశ భావాలు సరిగ్గా వచ్చాయా? లేదా?' అని అడిగి, భగవాన్ వాటిని ఆమోదించాకే, వాటిని మురుగనార్ మాలగా కూరుస్తూ వచ్చారు.

ఈ విధంగా వారు కూర్చిన పద్యాల మొత్తం 1254. కొన్ని సందర్భాలలో భగవాన్ ఆ పద్యాలను సరిదిద్దుతూ, వాటి భావాన్ని సంగ్రహించీ, వివరించీ, లేదా కొన్ని కొత్త భావాలను చేర్చీ, అవసరమైతే తామే కొన్ని పద్యాలను రచించీ మధ్యమధ్యలో చేర్చారు. మురుగనార్ కూర్చిన ఈ 'గురువాచక కోవై' (గురువచన మాల) 1282 పద్యాలు కలిగిన ఒక

అరుదైన గ్రంథంగా తయారైంది. అమూల్యమైన, మహిమోపేతమైన వుపదేశ రత్నాలు వాక్యరూపం పొంది, ఈ 'గురువచన మాల' ప్రకాశిస్తున్నది.

ఒకపుడు శ్రీభగవాన్, "నన్ను నేను ఎలా తెలుసుకున్నానో, అలాగే నన్ను చూసేవారే, నన్ను యథార్థంగా తెలుసుకుంటారు" అని తెలిపారు. ఆ విధంగానే భగవాన్ వుపదేశాలను ఎలా వివరించారో, అలాగే వాటిని తాము గ్రహించి, వాటిని పద్యాలుగా మార్చి, గురుదృష్టితో ఆమోదింపచేసి, ఆ తరువాతే వాటిని శ్రీమురుగనార్ ఒక గ్రంథంగా వెలువరించారు. సమస్త బోధనా రహస్యాలు, వివరణలు క్రమపద్ధతిలో అమరిన జ్ఞాననిధి ఈ 'గురువచనమాల.' దీని రచనారీతి పద్యరూపంలో వుండి, అక్కడక్కడ అరుదైన (మారుమూల) పదాలు వుండడం వలన, కొంతమంది పాఠకులకు ఇది కఠినంగా అనిపించేది. అందువలన శ్రీసాధు ఓంగారు దీనికి చక్కని తాత్పర్యంతో కూడిన వ్యాఖ్యానాన్ని వ్రాసారు. దానిని 'శ్రీరమణ కేంద్రం, క్రొత్త ఢిల్లీవారు' ప్రచురించారు. రమణోపదేశాలను సులభంగా గ్రహించి, ఆనందించడానికి ఈ వ్యాఖ్యా గ్రంథం దోహదపడుతుంది అనడంలో సందేహం లేదు.

మౌనానుభూతి, మూర్తిగా ప్రకాశించే శ్రీభగవాన్ నుంచి జ్ఞాన ప్రపంచానికి, తరతరాల భక్తులకు 'ఉన్నది నలుబది, ఉపదేశసారం, గురువచనమాల' అనే రత్నత్రయమైన "రమణ ప్రస్థానత్రయమును" సంపాదించి ఇచ్చిన ఘనత శ్రీమురుగనారి. ఇందుకుగాను తమిళ విద్వల్లోకం, ఎపుడూ కృతజ్ఞతలు తెలుపడానికి వెనుకాడదు. 'ఈ గ్రంథవస్తువు వ్రాతప్రతుల్లో వున్నపుడే ఇందులోని సత్యాన్ని గ్రహించి, దీనిని ముద్రించి పుస్తక రూపంలో వెలువరిస్తే, భక్తులందరికీ సహాయకారిగా వుంటుంద'ని తలచి, దీనిని మొదటిసారిగా భగవాన్ భక్తులైన శ్రీరమణ పాదానందులు 1939వ సం||లో ముద్రించి వెలువరించారు. వీరికి మురుగనార్మీద, వారి రచనలమీద అపరిమితమైన భక్తీ, ప్రేమా. 'గురువచన మాల' రెండవ ప్రచురణ, శ్రీరమణాశ్రమంవారు 1971వ సం॥లో చేసారు.

## శ్రీరమణ దేవమాల - రచన

శ్రీరమణ భగవాన్ అనుగ్రహం పొందాలన్న రమణ దాహంతో, దానిసే తలుస్తూ, హృదయం కరిగేటట్లుగా వారి అనుగ్రహాన్ని పొంది; రమణ శాంతి సముద్రంలో మునిగిపోయి, తనను తాను పోగొట్టుకొన్నారు శ్రీమురుగనార్.

మురుగనార్ భేదస్థితిలో వుండి భగవాన్ను స్తుతించి, అభేద స్థితిని పొంది - 'తాను తప్ప మరేమీ లేదు' అనే అనుభవాన్ని, అనేక పద్యాలద్వారా తెలిపారు. ఈ గ్రంథమంతా ఒకేసారి రచించింది కాదు.

'నిజస్థితిని పొందడానికి వీరు పడిన శ్రమనూ, ఆ స్థితికోసం వారు పొందిన పరితాపమూ, వారి చింతను విన్న తరువాత శ్రీభగవాన్ కురిపించిన అనుగ్రహమూ' ఈ గ్రంథంలో మనం చూడగలం. ఇందువల్లనే, ఒక్కొక్క దశలో మనస్సు ఎలా క్రమక్రమంగా పరిపక్వతను పొందిందో తెలిపే చిత్రీకరణ, ఆయా భాగాలలో అపుడపుడు మురుగనార్ చేసారు.

శ్రీమురుగనారు తమ తల్లిమీద ఎనలేని ప్రేమ, భక్తి. తన తల్లిని అనుగ్రహిస్తూ, ఆమె బాధ పడుతున్నపుడు, 'ఆమె శరీర రుగ్మతతోపాటుగా ఆమె భవరోగాన్ని కూడా నిర్మూలించమ'ని భగవాన్ను ప్రార్థిస్తూ వ్రాసిన ఇందులోని పద్యాలు, మనస్సును ద్రవింపచేసేవిగా వున్నాయి. అవి తమిళ భక్తుడూ, విద్వాంసుడూ అయిన 'పట్టినత్తార భక్తితో పాడిన పాటల్ని' గుర్తుకు తెచ్చేటట్లుగా వున్నాయి. శ్రీరమణ దేవమాలలో ఒకచోట, 'మా అమ్మ ఈ కర్మచేత కష్టపడుతున్నది. మీ తల్లిగారిని చేసినట్లు, మా అమ్మను చేయండి,' అని మనస్సు కరిగేటట్లు విన్నవించుకొన్న పద్యం, దీనికి వుదాహరణ. తమ తల్లి జబ్బుతో మంచం పట్టినపుడూ, మరణశయ్యపైన వున్నపుడూ, 'ఆమెను అనుగ్రహించమ'ని దీనంగా విన్నవిస్తూ, వీరు వ్రాసిన అనేక పద్యాలు అందులో వున్నాయి.

'తమ తల్లి భగవాన్ పాదాలను చేరి సద్గతిని పొందిందనీ, నిన్ను శరణు పొంది తపః ఫలాన్ని పొందింది అనీ, వారికి ఆ అర్హత వుంద'నీ సూచిస్తూ, మరొక పద్యంలో వారు తెలిపారు. (ఇలా భగవాన్ను ప్రార్థించి) తన తల్లిని తరింపచేసిన మురుగనార్, 'తాను కూడా సంసారం నుండి విముక్తి పొందాలన్న కోరికతో, అనేక పద్యాలలో భగవాన్కు విన్నవించుకొని సాఫల్యాన్ని పొందారు.

'భగవాన్ నిగ్రహానుగ్రహ శక్తి గలవారు అయినప్పటికీ, వారిలో అనుగ్రహ శక్తే ఎపుడూ మనకు తెలుస్తుంటుంది అనీ; పరిపక్వత చెందినవారికేగాక, చెందని వారికి కూడా ఏ రకమైన అడ్డంకులు లేని భగవాన్ కరుణ లభించింద'నీ, అందరికీ తెలిసేటట్లు వారు అనేక పద్యాలు రచించారు. 'కొంచెమైనా అర్హత లేనివాడని ఎంచకుండా, శ్రీరమణానంద కుమారస్వామి చిత్తశుద్ధి లేని పామరునికి కరుణతో అద్వైత సత్యాన్ని తెలిపార'న్న పద్యం దీనికి వుదాహరణ.

ఈ గ్రంథం 'శ్రీరమణ సన్నిధిమురై' తరువాతే ముద్రింపబడి, 1939లో శ్రీరమణ పాదానందులచేత ప్రచురింపబడింది.

## 'శ్రీరమణ చరణం కలకాలం వర్ధిల్లుగాక!' అనే గ్రంథ రచన (శ్రీరమణ చరణ పల్లాండు)

నాయనారులూ, ఆళ్వారులూ భగవంతుని పాదాలను స్తుతిస్తూ, వాడని పుష్పాల మాలలాగా, 'రచన' అనే మాలతో అలంకరించి ఆనందించినట్లుగా; శ్రీమురుగనార్ కూడా తమ దైవమైన రమణుల పాదాలను, "శ్రీరమణ చరణం కలకాలం వర్ధిల్లు గాక!" అనే సువాసనా భరితమైన పద్యరచన మాలతో అలంకరించి పరవశులయ్యారు. ఆ పాద పద్మాలలోని మకరందాన్ని తాను ఆస్వాదించడమే గాక, తన రచనల ద్వారా భక్తులందరికీ కూడా దానిని పంచారు.

"తిరువణ్ణామలైలో బ్రహ్మ, విష్ణువులకు 'అరుణాచల తత్త్వంగా గోచరించిన ఆ సద్వస్తువే', తమకు అతి సులభంగా శ్రీఅరుణాచల కొండచరియలలో లభించింద"ని తలచి పొంగిపోయారు. 'నాకు నీవే దిక్కు' అనీ, 'నీవు కలకాలం వర్ధిల్లు' అనీ స్తుతిస్తూ రచించిన గ్రంథమే, ఈ 'శ్రీరమణ చరణం కలకాలం వర్ధిల్లు గాక!' అన్నది. ఈ రచనలోని భావాన్ని గ్రహించి చదివేవారు, 'తప్పక భగవాన్ను శరణు పొందేటట్లుగా ఈ గ్రంథం చేస్తుంది' అనడంలో ఎలాంటి సందేహమూ లేదు. 'నీవు నన్నేం చేయాలనుకొన్నావో, అలాగే చేయి. నీ శరణు జొచ్చాను' అని; 'తాను భగవాన్నే సద్వస్తువుగా తీసుకొని, ఆయనకు తనను సమర్పించుకొన్న విషయం' ఒక పద్యంలో మురుగనార్ తెలిపారు.

శ్రీమురుగనార్ ఈ గ్రంథంయొక్క మొదటి భాగాన్ని, శ్రీరమణ భగవానుల భక్తులైన శ్రీదేవరాజ ముదలియార్ కోరికమీద రచించారు. అలాగే ఈ గ్రంథం యొక్క ఆరవ భాగాన్ని, మరొక భక్తులైన శ్రీనారాయణ అయ్యర్ కోరిక మీద 'అష్టోత్తర శతకం'గా రచించారు.

అప్పర్స్వామి రచించిన 'శ్రీఆర్ద్ర పదికం' అనే గ్రంథంలాగా, శ్రీమురుగనార్ కూడా, 'పునర్వసు శోభ' అనే దశకాన్ని రచించారు. 'కొన్ని విశేష నక్షత్రాలలో జన్మిస్తే, దాని ప్రభావంచేత వారి జీవితం ఎంతో సిరిసంపదలతో నిండి వుంటుంద'ని ఎందరో నమ్ముతారు. అయితే కొన్ని నక్షత్రాలు మాత్రం వాటి
కాలంలో జన్మించినవారి కీర్తి ప్రతిష్ఠలచేత, తాము పేరుప్రతిష్ఠలు పొందుతున్నాయి! శ్రీరాముడు, శ్రీరమణుడు జన్మించడంచేత పునర్వసు నక్షత్రానికి పేరూ, ప్రతిష్ఠ కలిగాయి!

ఈ గ్రంథం చివర, వీరు రచించిన 'మంగళాశాసనం' (వాఘు) ఎంతో చక్కని రచన. శ్రీఅరుణగిరినాథుని భక్తి కవితల్లాగా శ్రీమురుగనార్ భక్తి, వారి రచనల్లో పొంగిపొరలుతుంది. ఈ అద్భుత గ్రంథాన్ని 1943వ సంవత్సరంలో శ్రీరమణ పాదానందులు ప్రచురించారు.

## శ్రీ అక్షరరమణమాల - వ్యాఖ్యా రచన

'శ్రీఅరుణాచల అక్షరమణమాల'కు మురుగనార్ వ్రాసిన వివరమైన వ్యాఖ్య ఎంతో శ్రేష్ఠంగా వుంది. 'శ్రీభగవాన్ తప్ప వేరే గతి లేద'ని వారికి శరణు పొందినవారు మురుగనార్. 'వాని అనుగ్రహంచేతనే, వాని పాదాలను సేవించి' అనే మహావాక్యాల లాంటివాటితో, శ్రీరమణ మహర్షి అనుగ్రహాన్నే ప్రధాన వస్తువుగా ఎంచుకొని, ఈ గ్రంథానికి వ్యాఖ్యానం వ్రాసారు.

శ్రీభగవాన్ సశరీరులై వున్నపుడే, వారి సమ్ముఖంలోనే మురుగనార్ 'మూలానికి, తన వ్యాఖ్యానానికి ఇసుమంతైనా వైరుధ్యం లేకుండా వుండేటట్లుగా'; మూలంలోని ఒక్కొక్క శబ్దానికి, 'మూలకర్త అయిన భగవాన్ యొక్క భావం' స్పష్టంగా గ్రహించి, ఈ వ్యాఖ్య వ్రాసారు. రెండింటికీ వైరుధ్యం లేకుండా వుండేటట్లుగా రచించడమే, ఈ వ్యాఖ్యారచన యొక్క వైశిష్ట్యం. ఇంతదాకా అందరిచేతా ఒక స్తోత్ర గ్రంథంగా మాత్రమే పారాయణం చేయబడుతున్న 'శ్రీఅరుణాచల అక్షరమణమాల' స్తోత్రం, వ్యాఖ్యానం వలన, ఒక లక్షణ గ్రంథంగా కూడా భక్తుల హృదయాలలో ప్రతిష్ఠింపబడింది.

'శ్రీఅరుణాచలేశ్వర అష్టబంధన మహాకుంభాభిషేక స్మృతి'గా శ్రీమురుగనార్ దీనిని, 04-06-1944న అరుణాచల గురుపాదాలకు వ్రాతప్రతిగా వున్నపుడు సమర్పించారు. ఆ తరువాత శ్రీభగవాన్ మహాసమాధి అనంతరం, 1952వ సంవత్సరంలో దీనిని శ్రీరమణాశ్రమ నిర్వాహకులు ప్రచురించారు.

## శ్రీరమణానుభూతి రచన

'శ్రీరమణానుభూతి' అనే గ్రంథం రెండు భాగాలుగా వుంది. దీనిని కూడా మురుగనార్, శ్రీభగవాన్ సశరీరులై వుండగానే రచించారు. అయినా శ్రీభగవాన్ శరీరం రుగ్మతతో వుండడం వలన, వారు ఈ గ్రంథాన్ని శ్రీభగవాన్ దృష్టికి తీసుకొని పోలేదు. అయినా ఇందులోని కొన్ని భాగాలను మాత్రం, శ్రీభగవాన్ పరిశీలించారు.

శ్రీమాతృభూతేశ్వర ఆలయ ముఖమండపంలో వున్న రాతిసోఫాలో, భగవాన్ ఆసీనులై వున్నపుడు, ఒకసారి 'బృహదాంబాళ్' అనే ఒక భగవాన్ భక్తురాలు, 'రమణ అలంకారం' అనే ముప్పై రెండు పద్యాలు వున్న భాగం నుంచి, కొన్ని పద్యాలను పాడారు. ఆ పద్యాలను విన్న శ్రీభగవాన్ ఆమెను, "ఆ పాడింది ఏమిటి?" అని అడుగగా, ఆమె తొట్రుపాటుతో "అలంకారం' అని వ్రాసి వుంది" అని అంది. శ్రీభగవాన్ వాటి ఛందస్సు రీతిని బట్టి, అక్కడే కూర్చుని వున్న మురుగనార్వైపు తిరిగి, "నాకు అలంకారం చేస్తున్నారా?" అని అడిగారు! దానికి మురుగనార్ సమాధానంగా, ఏమీ పలుకలేక కన్నీటితోనే బదులిచ్చారు.

'రమణాలంకారం' తరువాత రచించిన ఈ 'రమణానుభూతి' యొక్క రెండు భాగాలు కూడా వ్రాతప్రతిగానే వున్నవి. చెట్టినాడు మేలైశ్శివపురి మిత్రుల కోరిక మీద, 'మద్రాసు రమణ భక్తసభ' స్థాపకులైన శ్రీస్వామినాథయ్యర్ గారు దీనిని ముద్రించడానికి పూనుకున్నారు. ముద్రించే పని కోసం అపుడపుడు రమణ పాదానందులకు వీరు వుత్తరాలు వ్రాయడమే కాకుండా, దానికి కావలసిన డబ్బును కూడా ఇచ్చారు. చెట్టినాడు మిత్రులు కూడా చాలా ధన సహాయం చేసి, త్వరలో ఈ గ్రంథ ప్రచురణ జరుగడానికి తోడ్పడ్డారు. రచనయే తన వృత్తిగా భావించిన మురుగనార్, తమ కవితా శక్తితో భగవత్ స్తోత్రాలను రచించి, వాటిని శ్రీభగవాన్ పాదాలకే సమర్పించి మహదానందాన్ని పొందేవారు. 'రమణానుభూతి' అనే ఈ గ్రంథంలో, తాము పొందిన మహోపకారాన్ని తలచినపుడల్లా, 'శివమే కావడమనే అనుభూతి'ని పద్యరూపంలో వ్రాసారు.

మురుగనార్ను వశం చేసుకొన్న శ్రీరమణ భగవానుల అనుగ్రహశక్తి వలన, 'వారి హృదయంలో ఎల్లపుడూ స్ఫురిస్తున్న అనుభూతిని, వారి వాక్కే' వివరిస్తోంది. కానీ, దానిని ఇతరులు ఎలా వివరించగలుగుతారు? సదా గురు స్వరూపమైన స్వరూప చింతనలో రమిస్తూ, వారు పాడిన ఈ పద్యాన్ని చూడండి -

మంచి శివజ్ఞానమనే అనుగ్రహం ఆకాశమంతటా నిండిన మౌనమనే పద్మంలో, నేనొక తుమ్మెదనయి జీవించడంవల్ల ఈ శరీరం, ప్రాణం, స్ఫురణ, ఇంద్రియాలు అన్నీ కూడా ఆ మధువు రుచిని ఆస్వాదించి శాంత శివమయ్యాయి!

(33వ పద్యం - మొదటి భాగం శ్రీరమణానుభూతి)

వీరి మనోవాక్కులు స్వానుభూతిలో లీనమై ఎలా ప్రకాశిస్తున్నవో, పై పద్యం తెలుపుతోంది. 'ఈ రమణానుభూతి కావ్యం' మొత్తమూ, శివగంధ పరిమళాలను వెదజల్లే పద్యమాల!

శ్రీరమణ పాదానందుల కృషి, పట్టుదల వలన ఈ కావ్యం రెండు భాగాలూ చక్కగా ముద్రణ అయి, ప్రచురింపబడ్డాయి. మొదటి భాగం శ్రీకె.స్వామినాథన్ గారి గృహం అయిన 'ధర్మాలయం' వారి సాయంతో, 1960 అక్టోబరులో మొదటగా ప్రచురణ అయింది. రెండవభాగం 'శ్రీరమణభక్త సభ' ధర్మాలయపు ప్రచురణగా, 1961 డిసెంబరు నెలలో వెలువడింది.

శ్రీమురుగనార్ గ్రంథాలను ప్రచురించడంకోసం, శ్రీస్వామినాథయ్యర్ ఎంతో శ్రమించారు. ఈ అరుదైన గ్రంథం వ్రాతప్రతిగానే వుండి కాలగర్భంలో కలిసి పోకుండా, ముద్రించి వెలువరించిన 'మద్రాసు రమణభక్త' సేవ మెచ్చుకోదగింది. ఈ కృషిని ఎప్పటికీ మరువకుండా జ్ఞాపకం పెట్టుకోవడమే, వారికి కృతజ్ఞతలు చెప్పుకోవడానికి సరైన పద్ధతి.

## రమణ జ్ఞానబోధము - రచన

ఈ శతాబ్దపు మహాగొప్ప తమిళ విద్వాంసులు శ్రీమురుగనార్. ఒక క్రమ పద్ధతిలో తమిళభాషా సాహిత్యాలను అధ్యయనం చేసిన వీరికి, చిన్ననాడే రచనా నేత్రాలు విచ్చుకొని, కవి అయ్యారు. సద్గురు శ్రీరమణ భగవాన్ను దర్శించిన తరువాత వీరి బాహ్య, అంతర జీవితాలలో మార్పు కలిగి, వీరి కవిత్వం కొత్త పుంతలు తొక్కింది. మహా విద్వాంసులు కూడా ప్రశంసించగలిగిన భావగర్భితమైన పద్యాలు, వీరి హృదయం నుంచి ఊటగా బయటకు వచ్చాయి.

శ్రీమురుగనార్ భక్తికి వారే సాటితప్ప మరొకరు లేరు. ప్రాచీన కాలపు మహా కవుల గంభీరమైన తమిళ కావ్య రచనాలంకారాలు, శ్రీమురుగనార్కు ఎలాంటి ప్రయత్నం లేకుండా సహజంగానే వచ్చాయి. తిరుక్కురళ్ను లోతుగా అధ్యయనం చేసిన శ్రీమురుగనార్, ఆ గ్రంథ రచయిత అయిన వళ్ళువరైయొక్క కావ్యాలంకార బాణీతో శబ్దప్రయోగం చేయడంలో సిద్ధహస్తులు. తిరుక్కురళ్ను యథాతథంగా అర్థం చేసుకోవాలంటే, మురుగనార్ వద్దనే దానిని పాఠం చేయాలి.

"తీర్థయాత్రకు వెళుతున్నాం. మాతో వస్తారా?" అని కొందరు భక్తులు మురుగనార్ను ఆహ్వానించగా, వారితో శ్రీమురుగనార్ “నేను ఎక్కడికైనా వచ్చి ఏమి చూడగలుగుతాను? జ్ఞానసూర్యుడైన రమణుని చూడగానే, ఆ తేజస్సులో నా కళ్ళు గుడ్డివైపోయాయి. ఆ గుడ్డికళ్ళతో ఎక్కడికి వెళ్ళినా ఏమి చూడగలుగు తాను?" అన్నారు. ఇలా తాము పొందిన ఆత్మజ్ఞాన నేత్రాలను 'గుడ్డి కళ్ళు' అని నమ్రతతో, వినయంగా వారు తెలిపారు.

శ్రీమురుగనార్ తమను గురించి ఏమీ తెలుపడానికి ఇష్టపడేవారు కాదు. అందువలనే వారి గురించి చాలామందికి సరైన అవగాహన కలుగలేదు. బట్టలతో కాకుండా, వారు అంతరంగంలో 'గొప్ప సన్న్యాసి' (మనస్సన్న్యాసి). కండువా కూడా లేకుండా ఎనభై మూడు సంవత్సరాలు నిజమైన సన్న్యాసిగా ఆయన జీవించారు. వృద్ధాప్యంచేత శరీరం నీరసించినప్పటికీ, వారి హృదయంలోని కవితావేశం ఏ మాత్రమూ తగ్గలేదు. చేతివేళ్ళతో కలం పట్టుకొనే శక్తి లేకపోయినప్పటికీ, వారి నోటి నుండి స్వచ్ఛమైన తమిళ పద్యకవితలు ఆగని ఊటలాగా ఊరుతుండేవి.

జీవిత అంతిమక్షణం వరకూ, నిరంతరాయంగా కావ్యరచనామృతాన్ని కురిపించిన తమిళ మహాకవి శ్రీమురుగనార్. 'కీర్తి' అనే మాట తన చెవిలో పడడానికి కూడా ఇష్టపడని విరక్తుడు ఆయన. సముద్రం నుంచి తీసిన కాలువ ప్రవాహంద్వారా వెల్లువలాగా వచ్చిపడిన శ్రీమురుగనార్, ముప్పై వేలకు మించిన పద్యాలను రచించారు. అధిక సంఖ్యాక పద్యాలను రచించిన అల్పసంఖ్యాకులైన మహాకవులలో మురుగనార్ ఒకరు.

శ్రీమురుగనార్ రచనలను

1) స్తోత్రాలు,
2) శాస్త్రం,
3) స్వానుభవాలు,

అనే మూడు భాగాలుగా విభజింపవచ్చును.

(1) వీటిలో శ్రీరమణ సన్నిధిమురై, శ్రీరమణ దేవమాల, శ్రీరమణ చరణం కలకాలం వర్థిల్లు గాక! అనే రచనలు 'స్తోత్రాలు'.

(2) పరమార్థ జ్యోతిలాంటి గురువాచక కోవై (గురువచన మాల) 'శ్రీరమణ వుపదేశాల శాస్త్రం'.

(3) శ్రీరమణ జ్ఞానబోధం అనే పద్నాలుగు వేల పద్యాల గ్రంథం 'వారి స్వానుభవం'.

ఇన్ని రచనలను మురుగనార్ ఇన్ని రకాలుగా చేసారంటే, శ్రీభగవాన్ అనుగ్రహ చ్ఛత్రం ఎంత విశాలమైందో, ఎంత శక్తివంతమైందో మనం గ్రహించవచ్చును. అయితే విచిత్రం ఏమిటంటే, ఇంత అరుదైన, అనుభవజ్ఞుడైన శ్రీమురుగనార్ ఏమీ తెలియని అతి సామాన్యునివలె, మన మధ్య ఒకరిగా జీవించడం!

ఎవరో మురుగనారు పరిహసిస్తూ మాట్లాడిన మాటల్ని శ్రీభగవాన్ విని, వెంటనే, "ఎపుడైతే సన్నిధిమురై, గురువచన మాలను మురుగనార్ రచించారో, అపుడే వారు భక్తాగ్రేసరులు అయ్యారు. ఇపుడు వీరి పరిహాసపు మాటలతో వారి స్థితి ఏమీ తగ్గిపోదు" అని మృదువుగా ఖండించారు. (ఈ సంఘటన శ్రీనటనానందులు ప్రత్యక్షంగా చూసి చెప్పింది.)

శ్రీమురుగనార్ రచించిన ముప్పై వేలకు పైబడిన పద్యాలను వారి స్నేహితులూ, అభిమానులూ, ఆశ్రమమూ ముద్రించగా; ముద్రించవలసినవి ఇంకా పద్నాలుగు వేల పద్యాలు వున్నాయి. వాటిని కూడా ముద్రించి ప్రచురించడానికి 'రమణ కేంద్రం, ఢిల్లీ'వారు సంతోషంగా అంగీకరించారు.

ఈ పద్యాలన్నిటికి కలిపి 'శ్రీరమణజ్ఞాన బోధము' అని పేరు. ఇందులో తొమ్మిది భాగాలు వుండగా, మరల ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క శీర్షికను ఇచ్చారు. శ్రీసాధుఓంగారు ఈ శీర్షికలకు పేర్లు పెట్టగా, వీటిలో ఆరు భాగాలు ప్రచురణ అయ్యాయి. తక్కిన మూడు భాగాలూ వెలువడడానికి 'రమణ కేంద్రం'వారి సద్భావన, సదాలోచన, ప్రయత్నమే లేకపోతే; తొమ్మిది భాగాల 'శ్రీరమణ జ్ఞాన బోధం' అనే జ్ఞానభాండాగారాన్ని చూడడం అసాధ్యమయ్యేది. ఈ అసాధ్య కార్యాన్ని చేయడానికి పూనుకొన్న రమణ కేంద్రంవారికి తమిళభాషా ప్రపంచం, రమణ భక్తులూ సదా ఋణపడి వుంటారు. ఈ 'శ్రీరమణ జ్ఞానబోధం' గ్రంథ ప్రథమ భాగం 1979వ సంవత్సరంలో ప్రచురించారు. కానీ, అప్పటికే శ్రీమురుగనార్ స్వామి విదేహులయ్యారు.

రామనాథపురం కృష్ణయ్యర్ కుమారుడుగా పుట్టిన సుబ్రహ్మణ్యం, తమిళ భాషాభిమానంతో తన పేరును 'ముగువై కణ్ణమురుగనార్' అని మార్చుకొన్నారు. అనేక సంవత్సరాలు పల్లాకొత్తులో వున్న వీరు, మద్రాసులో డాక్టరుగా వున్న రమణ భక్తులు టి.ఎన్. కృష్ణస్వామి అయ్యర్గారి కోరికపై, వారి ఇంట్లో నివసించారు.

ఈ టి.ఎన్.కె.గారి ఇంట్లో వారు వుంటున్నపుడే, నేను (టి.ఆర్. కనకమ్మ), సౌ॥పద్మ వారికి కావలసిన సదుపాయాలు కలిగిస్తూ, సపర్యలు చేసాం. అపుడే శ్రీభగవాన్ రచించిన 'గ్రంథమాల'ను అంతా వారి వద్ద పాఠం చేసే అవకాశం పొందాము. ఆ తరువాత 1958లో సౌ॥పద్మ తిరువణ్ణామలై వదలి మద్రాసు వెళ్ళగా, భగవాన్ దయ వలన నేను ఈనాటి వరకు ఆ ఇంట్లోనే వుంటున్నాను. తరువాత మురుగనార్ నాకు 'ఒషివిలొడుక్కమ్' మొదలైన వేదాంత గ్రంథాలను పాఠం చెపుతూ, అనేక గ్రంథాల నుంచి కూడా అనేక అంశాలను తెలిపి అనుగ్రహించారు.

శ్రీమురుగనార్ ఆరోగ్యం బాగా లేని రోజుల్లో, అంటే 1971లో - ఆశ్రమంలోని వైద్యశాల పక్కన వున్న ఎ-18 గదిలో, వారు వుండడానికి ఏర్పాటు చేసారు. ఆశ్రమంవారు వారికి కావలసిన ఆహారం, వైద్యం మొదలైన అన్ని సదుపాయాలు చేయగా, శ్రీగణేశన్ మొదలైనవారు వారిని కంటికి రెప్పలా చూసుకున్నారు.

శ్రీమురుగనార్ ఆరోగ్యం ఏ వైద్యానికీ లొంగక రోజురోజుకీ దిగజారి, చివరకు ఆవణి అమావాస్య రోజు (28-08-1973)న వారు విదేహముక్తులై, శ్రీభగవాన్ పాదపద్మాలలో ఐక్యమయ్యారు. ఆశ్రమానికి వుత్తర దిశన, అరుణాచలం వాలులో వారి దేహాన్ని సమాధి చేసారు. వారు ముక్తులైన తిథినాడు ప్రతి సంవత్సరం, 'ఆరాధన'గా వారి సమాధి పూజ జరుగుతుంది.

శ్రీభగవాన్ భక్తులలో మిక్కిలి గౌరవితులైన శ్రీమురుగనార్ గొప్ప ఆత్మజ్ఞానీ, మహాతమిళ విద్వాంసుడూ, ఎంతో గురుభక్తి, నమ్రతా గలవారు. వీరు విదేహముక్తులు అయ్యాక వారి స్మృత్యర్థం, సాంత్వనంగా శ్రీసాధుఓం స్వామి కొన్ని పద్యాలు రచించారు. వాటిలో కొన్నిటి భావం:-

సానుభూతి

"జ్ఞానీ - ప్రాచీన తమిళ కంఠంతో ఎనబై మూడు సంవత్సరాలు మధురంగా పాడిన కవి కోకిల, ఈ భూమి కన్న మహారత్నం - మహా రమణాకాశంలో ఎగిరిపోయింది. ఏం చేద్దాం? ఎగిరి వెళ్ళారు కదా!"

ఓదార్పు

“మురుగనార్ అంటే నాలుగు మూరల దేహమా? మురుగనార్ మీద ప్రేమ కలిగి వున్నారే! ఎవరీ మురుగనార్? అరుణాచల రమణుడు, ఆది శివుడు మనకు అనుగ్రహించిన జ్ఞాననేత్రంలాంటివారు మురుగనార్.”

ఇంతవరకు శ్రీమురుగనార్ 'శ్రీభగవానన్ను వుద్దేశించి రచించిన గ్రంథాలను, వారే రచించిన ప్రత్యేక రచనలను, అవి ఎందుకు వ్రాయాల్సి వచ్చిందీ' తెలిపాను. ఇవి కాకుండా, వారు రచించిన 'శ్రీరమణ సన్నిధిమురై'లో మురుగనార్కు, శ్రీరమణులకూ వున్న సన్నిహిత సంబంధం, దానిని తెలిపే సంఘటనలు అనేకం వారు రచించిన గ్రంథాలలో అక్కడక్కడా కనిపిస్తాయి.

వాటిల్లో కొన్నింటిని ఇక్కడ చూద్దాం:-

# తమిళ భాషాభిమానం

సన్నిధిమురైలో వీరు రచించిన కొన్ని గీతాలనుబట్టి, గాంధేయవాదిగా సర్వమత సమభావం వీరిని ఆకర్షించిందని తెలుసుకోవచ్చును.

భక్తుడవే అందునా! పరమశివుడవే అందునా! దయామయుడవైన క్రీస్తువందునా! ముక్తుడవందునా! ఆది దైవమందునా! మహ్మద్ నబీవందునా! జ్ఞానివందునా! నిర్మలుండవందునా! గౌతముడవందునా! ఈశ్వరుడవందునా! సుబ్రహ్మణ్యుడవందునా! ఈశ్వరా రమణదేవా! అన్నీ నీవే!

# రమణ దేవపదికం (సన్నిధిమురై)

మరో పద్యంలో, "అస్పృశ్యత ఒక మైల అని, దానిని పూర్తిగా నాశనం చేసి, తమ మనస్సులను నిష్కల్మషం చేసుకోవాల”ని ప్రార్థించారు. ఇది ఈనాటివారు గమనించాల్సిన సున్నితమైన విషయం.

మరో పద్యంలో, "ప్రజల సంస్కారాన్ని పెంపొందించడానికోసం జన్మించి, 'సత్యవ్రతుడు' అని కీర్తి పొంది, 'ప్రేమ' అనే దైవమే భూమి మీదకు అవతరించి, భూమిమీద వున్న ప్రాణులన్నిటికీ సుఖసంతోషాలు ఇచ్చేవాడూ, దేశస్వాతంత్ర్యాన్ని ఆర్జించి తీరాలన్న దృఢసంకల్పం గలవాడూ అయిన 'గాంధీ' పేరును చెవులారా విని, ఆనందంగా ఆయన నాయకత్వంలో పెద్దలు అనేకులు దేశస్వాతంత్ర్య సౌభాగ్యాల కోసం అనేక కష్టాలను అనుభవించారు. మూఢుణ్ణి అయిన తాను ఏమీ చేయలేద"ని ఈ దేశభక్తుడు వాపోయారు. ('ఉపదేశ తిరువగవల్' అనే గ్రంథంలోని 7వ వరుస నుంచి 20వ వరుస వరకు ఈ భావం వుంది.)

దేశభక్తిలాగానే వీరికి వున్న మరొక భక్తి 'తమిళభాషా భక్తి'. చిరుత ప్రాయంలోనే వీరికి సౌష్ఠవమైన తమిళ భాషాజ్ఞానం అలవడింది. వీరు చదువని గ్రంథాలు లేవనే చెప్పాలి. తమిళ భాషా సౌందర్యం నిండిన 'సిలప్పది కారమ్" మొదలైన పంచమహాకావ్యాలను, 'నాలాడియార్, తిరుక్కురళ్' వంటి నీతి గ్రంథాలను వీరు క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. తిరుక్కురళ్ళ వీరికి వున్నంత అభిమానం, మరి దేనిమీదా లేదని చెప్పాలి. అయితే, 'రమణ పురాణం'లోని కొన్ని పద్యాలలో, వీరు వాక్కుమీద వున్న అభిమానాన్ని వదిలేసి, మౌనం మీద పక్షపాతం పొందినట్లు తెలియడం వలన, వాగ్రూపమైన కావ్యాల మీద అభిమానం పోయిందనే అనుకోవాలి.

"ఎపుడూ ఏదో వాగుతున్న నా హృదయాన్ని అనుగ్రహపు వెల్లువ చేసి, నా నోటిని మూయించిన నీ కీర్తికి, నీ ఖ్యాతికి జయమగుగాక!"

(117, 118 - సులభం)

"నిరుపయోగకరమైన ఇతర గ్రంథాలమీద నాకు వున్న విపరీతమైన ఆసక్తిని సమూలంగా పెరికివేసావు. అలాంటి మౌనజ్ఞాన స్వరూపుడవైన మీ పాదాలను స్తుతిస్తాను.

(201, 202)

"దేహాన్ని గృహంగా చేసుకొని, తన వునికిని మరపించి, నోటి భాషలాగా కనిపించే మనస్సుయొక్క మూలప్రవృత్తి వివరించలేనిది. ఆ మూలంయొక్క మాతృభాష 'మౌనమే'. అలాంటి భాషతో పరమార్థ తత్త్వాన్ని వుపదేశించే పారంపర్యానికి ఆది గురువైన దక్షిణామూర్తిగా వెలుగొందే ఓ మౌనమూర్తీ!

(316 - 319)

ఈ విధంగా మురుగనార్ తన భాషాభిమానాన్ని మౌనభాషతో నాశనం చేసిన ఆదిగురువు దక్షిణామూర్తిగా వెలుగొందే శ్రీభగవాన్ను స్తుతిస్తూ పాడారు.

'నీవే గతి' అంటూ మురుగనార్ శ్రీభగవాన్ వద్దకు చేరాక, వారికి ఇక ప్రపంచం మీద ఎలాంటి అభిమానం లేకుండా పోయినా, తమిళభాషా కవిత్వం మీద వారికి వున్న అభిమానం మాత్రం వారిని విడువకుండా దహించి వేస్తూ వుంది. ఈ అభిమానం ఎంత గాఢంగా వుందో, వారే ఇలా తెలిపారు:

"ఇల్లూ, వాకిలీ, భార్యా, వృత్తీ మొదలైన వాటన్నిటినీ పరిత్యజించిన మనస్సుతో ఎంత ప్రయత్నించినా, తమిళ కావ్యాలను మాత్రం త్యజించలేని దుర్బలుడిని అయ్యాను. మృతశరీరుడిని నేను. సత్కర్మ ఫలితంగా ఈ కవితలతో నీ కీర్తిని పడుగూ పేకగా అమర్చి, గీతాలుగా నేసే మగ్గంలో మనస్సును వుపయోగించి శాంతి పొందుతాను."

"ఇలా 'నేసిన' గీతాలలో భగవాన్ను అలంకరించి తృప్తి పొందుతాను" అన్నారు. వారు. "పరిత్యజించలేకపోయిన కవిత్వం, భగవాన్ పాదపద్మాలకు సమర్పించడం చేత, అది శాశ్వతమైన మహోన్నత స్థితికి చేరింద"ని కూడా మురుగనార్ అన్నారు.

ఇలా భగవాన్కే తన కవిత్వాన్ని నేసి ఇచ్చినందువలన, తనకు లభించిన కానుకను మరోచోట తెలుపుతూ, "తిరుక్కురళ్వంటి శ్రేష్టమైన తమిళ గ్రంథాలమీద తనకు వున్న ఆశామోహాలు భగవాన్ దర్శనంచేతా, అనుగ్రహ దృక్కులచేతా పూర్తిగా తొలగిపోయాయి" అన్నారు.

## గురి తప్పని వధ

"శ్రీభగవాన్ సన్నిధిని చేరి వారి అనుగ్రహ వీక్షణాలకు గురి అయినవారు, వాటినుండి తప్పుకొని 'బ్రతకడం' చాలా కష్టం. గురిపెట్టి భక్తుల ప్రాణాన్ని (అహాన్ని), గురి తప్పకుండా వధించడంలో వారికి వారే సాటి. అలాంటి ఈ అరుదైన కళను భగవాన్ ఎక్కడ అభ్యసించారు?" అని మురుగనార్ శ్రీభగవాను అడుగుతున్నారు. వారి మాటల్లో:

"నీవు ఈ అరుదైన విద్యను అభ్యసించిన పాఠశాల ఏది? అది ఎక్కడ వుంది? దాని పేరు ఏమిటి? ఈ వధించే విద్యను నీకు నేర్పిన ఆచార్యుడు ఎవరు? ఆయన పేరు ఏమిటో?' అని ఆశ్చర్యం కలుగుతోంది. అయితే, నీవు పుట్టిన వంశంయొక్క వైశిష్ట్యం, దయాగుణమే ఆకృతిని పొంది ప్రఖ్యాతి పొందిన బ్రాహ్మణ వర్ణం. నీవు ఈ వధించే వృత్తిని అవలంబించడంలోనూ ఒక విశేషం వుంది. ప్రపంచంలో సుఖశాంతులతో బ్రతకాలని అనుకొని ఎవరు నీ శరణు జొచ్చుతున్నారో, అలాంటివారి తీయని ప్రాణాలు తప్ప, ఇతర ప్రాణాలు నీకు ఇష్టం కావు! అయినా ఈ విభిన్నమైన వేంకట గురుబ్రహ్మ దగ్గరకు వెళితే, మనం తరించగలమా?!"

(24వ పద్యం - సన్నిధిమురై)

ఇంకా వారు ఇలా వ్రాస్తున్నారు:

"భక్తులను హరించాలని ధ్వజమెత్తిన నిన్ను కట్టుకొని ఎలా జీవిస్తాను అరుణాచలా!' అని నీ గురువును ప్రశ్నిస్తున్నారే! మరి మీరు కూడా అదే వృత్తిని అవలంబిస్తున్నారు కదా! ఇంకా మాట్లాడే గురువును మించిన శిష్యునిలాగా చేస్తున్నారు మీరు! గురువేమో తనను స్మరించినంత మాత్రంలో ప్రాణాన్ని (అహాన్ని) తీయగలవారు. ఇంక శిష్యుడు అయితేనో కేవలం క్రీగంటి చూపుతోనే, పెట్టిన గురి తప్పకుండా, ప్రాణాన్ని చంపి తింటున్నారు"

అని ఇలా శ్రీరమణుల వైశిష్ట్యాన్ని నిందాస్తుతిగా మురుగనార్ వర్ణించారు!

## రమణీయ పద సుఖుడు

తిరుజ్ఞాన సంబంధులు 'మాదర్ మదప్పిడియు' అనే తేవారాన్ని రచించి పాడారు. ఆ రాగం చాలా అందమైందీ, సమస్యా పూరితమైందీ. శ్రీసంబంధర్ పాడిన ఈ తేవారం అనే పాటను, వీణమీద వాయించలేక తిరు నీలకంఠ నాయనార్ 'ఆ వీణ తంత్రులనే తెంపేయాల'ని అనుకొన్నారు. అపుడు సంబంధమూర్తి వారిని ఆపి, "అన్ని పాటలనూ తంత్రులను మీటి వాయించలేమ"ని గ్రహింపచేసి, వారిని సముదాయించి వాయింపచేసారు. అందువలన ఆ రాగానికి 'తంత్రులనే తెంచిన రాగం' (యాష్ మూరిప్పణ్) అనే పేరు వచ్చింది.

మురుగనార్ మీదా, వారు రచించిన శ్రీరమణ సన్నిధిమురైమీదా అపారమైన భక్తీగౌరవాలు వున్న 'శ్రీరమణ పాదానంద' మురుగనార్ను "తంత్రులనే తెంచిన రాగంలో, శ్రీభగవాన్మీద ఒక దశకాన్ని పాడమ"ని కోరారు. వారి కోరికను మన్నించి పాడిందే 'రమణ వైభవం' అనే దశకం. అందులో గొప్ప పదసౌష్ఠవం వుంది. అందులోని అయిదవ పాటలో మురుగనార్ శ్రీరమణ పాదానందుల పేరు కూడా వచ్చేటట్లుగా వ్రాసారు. ఒకసారి భగవాన్ సన్నిధిలో రమణ పాదానంద ఈ దశకంలోని పాటలు పాడుతుండగా, వాటిని నేను (కనకమ్మ) విని, ఆ మధ్యాహ్నం మురుగనార్ వద్ద పాఠానికి వెళ్ళినపుడు, "ఈవేళ శ్రీరమణ పాదానంద మీరు వ్రాసిన పాటలను చాలా బాగా పాడారు" అన్నాను. దానికి ఆయన నవ్వుతూ, "అలాగా, 'రమణీయ పదసుఖుడు' అనే పాట పాడారా?" అని అడిగారు.

"పది పాటలు పాడే సమయం లేకపోవడంచేత, మొట్టమొదట ఆ పాటే పాడారని చెప్పాను. వెంటనే వారు, "భేష్, భేష్!" అని చేత్తో బల్లను కొడుతూ "అలా చెప్పండి, ఆ పాట పాడకుండా వారు వుండలేరు. వారి పేరు అందులో వుండడం వలన, వారు దానిని తప్పకుండా పాడుతారు" అని చెప్పి నవ్వారు. "రమణీయ పదసుఖ" అనేది 'రమణ పాదానంద' పేరును సూచించేది అని అంతదాకా నాకు తెలియదు.

## తిరుచ్చాషల్ (చెలికత్తె గీతాలు - సఖీ గీతాలు)

సత్పురుషులైన పెద్దలు లోకంలో జన్మించడం, 'క్రిందటి జన్మలో వారు చేసిన అసంపూర్ణ తపస్సును పూర్తి చేయడానికే' అని పెద్దలు అన్నారు. వారికి ఆ అసంపూర్ణ తపస్సును పూర్తి చేయడమే ఈ జన్మ లక్ష్యం అవుతుంది. అలాంటి

తపస్వులు కొండలూ, గుహలూ, అరణ్యాలలో తపస్సు చేసుకొంటూ; తమకంటూ ఏదీ కూడబెట్టుకోక, భిక్షాన్నం తింటూ, అరుగుపై నిద్రిస్తూ, నీటిని మాత్రమే త్రాగుతూ, మరి ఎలాంటి ఆలోచనలకు తావీయక లోకంలో సంచరిస్తున్నారు. మనస్సులో దీనిని వుంచుకొన్న సఖి తన నాయకురాలితో, “ఈ వేంకట నాయకుడు గతంలో చేసిన తపస్సులోని కొరతను పూర్తి చేయడానికే గనుక ఇపుడు రాకపోతే; మరి దేనికోసం కౌపీనధారియై కొండలలోను, గుహలలోను ఏకాకిగా నివసిస్తూ, తన చేతినే భుజించే పాత్రగా చేసుకొని, భిక్షమెత్తుకుంటూ భూమిపై సంచరిస్తాడు? దీని భావం ఏమిటి?" అని చెలి అడుగగా, దానికి సమాధానంగా నాయకురాలు:

"అసంపూర్ణమైన తపస్సును పూర్తి చేయడానికి వచ్చిన వేంకట నాయకుడు ఈ భూమిమీద సంచరించడానికి కారణం - 'భగవంతుని పాదస్పర్శ కావాల'ని అనేక యుగాలుగా భూదేవి చేసిన తపస్సుకు ఫలం ఇవ్వడానికే అని తెలుసుకో" అని చెప్పింది. 'భగవంతుడు ఈ భూమిమీద ఎన్ని అవతారాలు ఎత్తినా, ఏదో ఒక వాహనం మీద పోయాడేతప్ప, తన పాదస్పర్శను భూదేవికి తిన్నగా ఇచ్చి వుండలేదు. దానిని ఇపుడు ఇవ్వాలనే వేంకట నాయకుడు భూమిమీద సంచరిస్తున్నా'రని మురుగనార్ చాలా చమత్కారంగా తమ భక్తిని వ్యక్తీకరించారు. భగవాన్ ఏ రోజున కూడా పాదరక్షలు ధరించకపోవడం అందరికీ తెలిసిన విషయమే. 'భూమికి ఈ దివ్యపాదాల స్పర్శభాగ్యం లభించింద'ని ఈ పాటలో చిత్రీకరించడం ఎంతో వుచితం. ఈ సఖీ గీతాలలో (తిరుచ్చాషల్) ఇలాంటి భావాలతో అనేక పాటలు వున్నాయి.

## తిరువమ్మానై (నాయికా-సఖుల సంవాదంతో కూడిన పాటలు)

సాధారణంగా తమ వద్దకు వచ్చేవారిని శ్రీభగవాన్ 'రండి' అని పిలవడం గానీ, 'వెళ్ళండి' అని చెప్పడంగానీ లేదు. వారు సాక్షీమాత్రంగా చూస్తారు అంతే. మనం ఏదైనా వారితో విన్నవించుకొంటే, 'తల ఊపిగానీ లేదా నవ్విగానీ' తమ ఆమోదాన్ని తెలుపుతారు. ఒకవేళ సందేహాలు వుండి అడిగితే, వాటికి సమాధానాలు చెపుతారు. ఇతర సమయాలలో వారు మౌనంగానే వుంటారు.

ఏదీ అడిగే శక్తి లేని పామరులు, భగవాన్ సన్నిధిలోని అనుగ్రహ శక్తిచేత మనశ్శాంతి పొంది, దేహాన్ని మరచి కూర్చొంటారు. భగవాన్ ఏమీ మాట్లాడకుండా, ఎవరినీ 'రండి' అని పిలవకుండా వున్నప్పటికీ; వారి దర్శనం కోసం భక్తులు కుతూహలంతో రావడంలోని రహస్యాన్ని శ్రీమురుగనార్ ఇలా వివరించారు:

“ఎవరినీ రమ్మ'ని నోటితో పిలువని వెంకటరమణుని సన్నిధికి, 'ఓహో!' అని భక్తులందరూ పరుగెత్తుకుంటూ వచ్చి ఎందుకు గుమికూడుతున్నారు? చెలీ! దీనికి కారణం ఏమిటి?" అని అడిగిన తన చెలికి, నాయిక బదులిస్తోంది. "పూలను సైతం మించిన కోమలమైన వారి పాదకమలాల ముందు ఆనందజలధి పొంగి పొర్లడం వల్లనే సఖీ, ఇలా అందరూ 'ఓహో!' అని పరుగెత్తి వస్తున్నారు.”

ఈ సంవాదంలో ప్రశ్నా, సమాధానాలుగా 'శ్రీభగవాన్ అనుగ్రహాన్నీ, కారుణ్యంతో నిండిన వారి అనుగ్రహ వీక్షణాన్నీ, అనేక అరుదైన భావాలను' శ్రీమురుగనార్ రచించారు. పైన చెప్పిన పద్యభావం ఇందుకు ఒక వుదాహరణ.

## తిరుక్కణోక్కమ్ (దివ్యకరుణా వీక్షణం)

'దివ్యకరుణా వీక్షణం' అనేది శ్రీరమణ సన్నిధిమురైలో ఒక ముఖ్య భాగం. ప్రాచీన గ్రంథాలలో లేని ఒక క్రొత్త రీతి రచన ఇది. భగవాన్ చక్షుదీక్షకు, వారి కారుణ్యం నిండిన అనుగ్రహ వీక్షణానికి ఈ భాగం ఒక నిదర్శనం. "పండితులూ, పామరులూ అనే తారతమ్యాలు లేకుండా, శ్రీభగవాన్ అనుగ్రహ కటాక్షం అందరి మీదా ఒకే విధంగా ప్రసరించి, వారిని పునీతులను చేస్తోంది. పురాణ కాలంలో దక్షిణామూర్తిగా మౌనంలో వుంటూ, చిన్ముద్రచేత ఏ సద్వస్తువును చూపించారో; శ్రీరమణులుగా అవతరించి 'ఆ చిన్ముద్ర కూడా అంగ చేష్టలు' అని త్రోసిపుచ్చి, భక్తులను తమ దృష్టితోనే పరిపక్వం గావించి, 'సత్' స్థితికి చేరుస్తున్నారు. దక్షిణామూర్తి ఆ స్థితిని చూపుతుండగా, శ్రీరమణమూర్తి ఆ స్థితికే చేరుస్తున్నారు" అని మురుగనార్ మరొక పద్యంలో తెలిపారు.

శ్రీరమణ సన్నిధిమురై, దివ్యకరుణా వీక్షణం - 27వ పద్యంలో తెలిపిన భావం.

"భక్తులకు తమ అనుగ్రహాన్ని తమ దృష్టితోనే చూపించినవాడు; మనస్సుచేత ఆలోచనకు, అక్షరాలచేత వర్ణనకు సాధ్యం కానివాడు; పసిడిఛాయ మేను గలవాడు, అత్యంత సుందరుడూ అయిన అరుణాచల రమణుని అమృత నేత్రాలతో, మనం మన చూపులతో ఆడుకుందాం" అని భగవాన్యొక్క దివ్యకరుణా వీక్షణాలను మురుగనార్ వర్ణించారు.

మరొకచోట, "వంచనతో నన్ను రప్పించి, వచ్చిన వెంటనే నా హృదయంలో ఈటెవంటి పదునైన చూపులను ప్రసరించి, నన్ను స్తంభింపచేసాడు (స్తబ్ధుణ్ణి చేసాడు). ఇది నాతో తమాషాకి (ఆటల్లోలాగా) చేసింది కాదు. వెంకటరాయుడు ఒక హంతకుడు. నన్ను హతమార్చాడు. వాని పాదపద్మాలను ప్రేమతో స్మరించి, ద్రవించి (కరిగి), అతని చెవిలో తుమ్మెదలాగా ఝుంకరించు" అని వ్రాసారు. ఈ దివ్యకటాక్ష వీక్షణ భాగంలో వీరు ఇలా శ్రీభగవాన్ అనుగ్రహ వీక్షణాన్ని ఎన్నో రీతులుగా కీర్తించి, గానం చేసి మనస్సును ద్రవింపచేసారు.

## ఏకాగ్రభక్తి

మురుగనార్ ఒక్క శ్రీభగవాన్ ను తప్ప మరే దైవాన్ని కూడా మనస్సులో తలవని దైవవ్రతుడు. వీరు రచించిన వేలవేల పద్యాలు ఒక్క భగవాన్ గురించి మాత్రమే. ప్రతి పద్యంలోనూ వీరు తమ తదేక భక్తిని తెలియపరిచారు. శ్రీరమణ పాదానందులు మురుగనార్పై ఎంతో భక్తి కలిగినవారు. 'భగవాన్ శ్రీసుబ్రహ్మణ్య స్వామి అవతారం' అని అనేక భక్తులు స్తుతించింది గ్రహించి, వారు మురుగనార్ను కూడా "భగవాన్ను సుబ్రహ్మణ్యస్వామి అవతారంగా తెలుపుతూ, రచన చేయమ'ని ప్రార్థించారు. వారి కోరికను మన్నించి, మురుగనార్ భగవాన్ను శివకుమారునిగా ఎంచి ఎన్నో పద్యాలు రచించారు. భక్తులలో భేదాలు వున్నప్పటికీ, భగవాన్ కేవలం సాక్షి మాత్రుడుగా వుండేవారే తప్ప, వారిని మార్చడానికి ప్రయత్నించేవారు కాదు. "భగవాన్ ఇలా వుండడం దైవలక్షణం కాబోలు!" అంటూ, "తన శరణు జొచ్చినవారిని పరిపక్వం చేయడానికి ఇది వ్యూహం" అని తన రచనల్లో మురుగనార్ అంటారు.

## ఆకులు కోయడానికి వెళ్ళి

శ్రీభగవాన్ అనుగ్రహపాత్రుడైన మురుగనార్ దివ్యజ్ఞానాన్ని పొందిన మహాకవి. భగవాన్పై వారు రచించినవి, మనస్సును ద్రవింపచేసే తమిళ పద్యాలు. అవి ఎంతో మధురమైన, తరగని కీర్తివంతమైన కవితా పుష్పాలు. ఆ మాధుర్యాన్ని ఎంత ఆస్వాదించినా, తరగని కవిత్వపు ఊటలు అవి. అలాంటి అపురూప నిధిని భగవాన్ పాదపద్మాలకు సమర్పించి, వారిని స్తుతిస్తూ ఆనందించారు. ప్రగాఢ ప్రేమ, భక్తి కలిగిన వీరు భగవాన్ వద్దకు వచ్చిన తరువాత కూడా, తన కవితా గంధాన్ని ఎన్నడూ వాడని సుగంధ పుష్పాలుగా చేసి, వాటిని రమణ మహర్షుల పాదాలచెంత అర్పించే కవితా మాలగా మార్చి, శాంతి పొందారు.

మురుగనార్ శ్రీభగవాన్ రమణ మహర్షితో ఎంతో సన్నిహితంగా మెలిగారు. ఎక్కడో పల్లాకొత్తులో వీరు వుంటున్నట్లు బయటకు కనిపించినప్పటికీ, మానసికంగా రెప్పపాటు కాలం కూడా వీరు మహర్షిని వీడలేదు. మహర్షుల అనుగ్రహం అనే వలలో చిక్కిన ఈ భగవంతుని దాసునకూ, దానశీలి అయిన శ్రీరమణులకు మధ్య జరిగిన సంఘటనలు అనేకం. అయితే వాటిని ఇద్దరూ బయట పెట్టలేదు.

"శ్రీభగవాన్ అనుగ్రహ కటాక్ష వీక్షణాలను పొందిన తనకు, అన్నీ నిరాసక్తంగా తోచేవి" అని మురుగనార్ చెప్పేవారు. భగవాన్తో వీరి బంధం ఇలాంటిది అని చెప్పలేం. అయితే వీరి మనస్సుకు హత్తుకున్న కొన్ని మధుర సంఘటనలను, సన్నివేశాలను వీరు అనుకోకుండానే తమ రచనల్లో వ్రాసారు.

మురుగనార్ భగవాన్ రమణ మహర్షుల వద్దకు వచ్చిన తొలి రోజుల్లో, ఆశ్రమం చిన్నదిగా వుండడం వలన భక్తులు కూడా ఎక్కువగా వుండేవారు కాదు అక్కడ. ఆ రోజుల్లో మహర్షితో ఏకాంతంగా వుండడానికి ఎంతో అవకాశం వుండేది.

కానీ, మహర్షిని ఎలాగైనా ఏకాంతంగా కలుసుకోవాలనే ఆశ ఒకటి, మురుగనారకు తీరని ఆశగా వుండేది! ఈ ఆవేదనను భగవాన్ గ్రహించారేమో అన్నట్లుగా ఒక సంఘటన జరిగింది.

ఆ రోజుల్లో భక్తులంతా అడవికి వెళ్ళి ఆకులు కోసుకొచ్చి, విస్తళ్ళు కుట్టి, వాటిల్లో భోజనం చేసేవారు. ఆకులు కోయడానికి భక్తులతోపాటు మహర్షి కూడా వెళ్ళేవారు. ఒకరోజు వుదయం అలా వెళుతున్నపుడు భగవాన్ మురుగనార్ను చూసి, అడవిలో ఆకులు కోయడానికి తనతో రమ్మని కనుసైగ చేసారు. దానిని గ్రహించి వారు భగవాన్ వెంట వెళ్ళారు.

శ్రీభగవాన్ నెమ్మదిగా అందరికంటే ముందు బయలుదేరి వెళ్ళగా, భక్తులేమో ఏవేవో పనులు వున్నందువలన కాస్త ఆలస్యంగా బయలుదేరి వెళ్ళారు. మురుగనార్ను తీసుకెళ్ళిన భగవాన్ అడవి మార్గంలో కొంతదూరం వెళ్ళాక, శోణతీర్థం దగ్గర పడుతుండే చిన్న జలపాతం ఒడ్డున దట్టమైన చెట్ల నీడలో, ఇసుక దిబ్బ మీద కూర్చున్నారు. వారివెంట వారి నీడలాగ వచ్చిన మురుగనార్ను, భగవాన్ తమ ఎదురుగా కూర్చోమన్నారు. ఎన్నాళ్ళనుండో భగవాన్ను ఏకాంతంలో కలుసుకొని, తన మనస్సులోని మాటను చెప్పుకోవాలనుకొంటూ వున్న మురుగనార్కు, అప్పుడు శ్రీమహర్షితో ఏకాంతం దొరికినా, ఆ మనస్సులోని మాట కాస్తా ఎగిరిపోయింది. భయం, భక్తి ఏకమై వారి మనస్సు స్తంభించిపోయింది!

ఎదురుగా కూర్చున్న భగవాన్ తమ అనుగ్రహ వీక్షణాలతో మురుగనార్ను కన్నులు ఆర్పకుండా తదేక దృష్టితో చూసి, వారి మనస్సును అణచివేసారు. ఆ చూపు అలాగే కొంత సమయం నిరంతరాయంగా కొనసాగింది. ఆ చూపుయొక్క ఒత్తిడి వలన మురుగనార్కు ప్రాణమూ, స్పృహ అణగిపోయి ఆనందంతో బాహ్య స్ఫురణలన్నీ తొలగిపోయి, శివానుభవం కలిగింది. ఇలా ఆ స్థితిలో వారు ఎంతకాలం వున్నారో వారికే తెలియదు.

కాసేపటి తరువాత బయలుదేరిన భక్తులు, మహర్షి రోజూ వెళ్ళే దారిలో కాసేపు వారికోసం అటూఇటూ వెదకి, వారు ఎక్కడుందీ తెలియక, ఆకులు కోసుకొని ఆశ్రమానికి తిరిగి వచ్చేసారు!

అయితే మురుగనార్ అంతర్ముఖుడై ఎలాంటి స్ఫురణ లేకుండా, కళ్ళు మూసుకొని వుండగా, శ్రీభగవాన్ లేచి ఆశ్రమానికి వెళ్ళిపోయారు! మురుగనార్ బాహ్య జగత్తులోకి వచ్చేటప్పటికి ఎదురుగా భగవాన్ లేకపోవడం గ్రహించారు. అప్పటికే సాయంకాలమై పొద్దు కుంకుతున్నది. అపుడు వారు ఎలాగో లేచి పల్లాకొత్తుకు చేరారు. "వారికి ఆ ఆనందలహరి అలా రెండు మూడు రోజులు వుందని ఆ తరువాత చెప్పారు. “ఈ ఆనందానుభవంయొక్క బిందువు తన మనస్సులో వుప్పొంగడం చేత, తాము లౌకిక కార్యాలను చేయలేకపోయేవారం” అని చెప్పేవారు. భగవాన్ తమకు ఈ ఆనందానుభవాన్ని ఎలా కలుగచేసారో, మురుగనార్ తన రచనలో కూడా ఒకచోట వ్రాసారు. తనకు భగవాన్ ప్రసాదించిన ఈ ఆనందానుభవాన్ని, తానే శ్రీభగవాన్ కు చెపుతున్నట్లుగా, శ్రీభగవానే విశ్వనాథస్వామికి వ్రాసి ఇచ్చారు! దాని భావం ఈ క్రింది విధంగా వుంది:

"హృదయం అనే తామర పుష్పం మీద ప్రకాశించే శ్రీఅరుణాచల రమణుడు చిరునవ్వు చిందించాడు. ఆ చిరునవ్వు త్రిపురములను దహించినట్లుగా; స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలను దహించివేసింది.”

"భగవాన్ దృక్కులు హృదయంలోకి దూసుకొనిపోయాయి. ఆ దృక్కులు అనుగ్రహ కటాక్షాన్ని ఇచ్చే చక్షుదీక్షను తలపిస్తున్నాయి. వాసనలన్నిటిని నిశ్శేషంగా నశింపచేసి, ప్రాణాలను అణచి, పక్వస్థితికి వచ్చిన జీవుడిని హరించి కబళించాయి అవి. జీవన్ముక్తియొక్క శివానుభవాన్ని హృదయంలో లెక్కలేనంతగా నింపాయి" అని మురుగనార్ చెప్పాడు!

(అంటే ఇక్కడ మురుగనార్ మాటల్ని భగవాన్ వుటంకిస్తున్న - quote - మిషతో, తాను వారికి కలిగించిన శివానుభవాన్ని గురించి తెలుపుతున్నారన్న మాట!)

ఈ మాటలతోపాటుగా శ్రీభగవాన్ "మురుగనార్ రచించిన 'సన్నిధిమురై', మాణిక్య వాచకుల తిరువాచకానికి ఈడయింద”ని పద్యం చివరి పాదంలో తెలిపారు. ఇలా మురుగనార్కు తాము ఏకాంతంలో ఇచ్చిన అనుగ్రహాన్ని, ఆ

తరువాత తామే రచించిన పద్యంద్వారా భగవాన్ తెలిపారు. ఈ విధంగా ఈ గురుశిష్యులు ఇద్దరూ తమ జ్ఞాపకాలను ఒకరికొకరికి తెలియకుండానే తెలిపి, పరస్పరం జ్ఞప్తికి తెచ్చుకున్నారు.

## శివరాత్రి ఉపవాసం

శ్రీమురుగనార్కు వుపవాసం వుండడం అనేది నేర్చుకోకుండానే వచ్చిన విద్య. భిక్షకు వెళ్ళని అనేక రోజులు వారికి వుపవాసమే కదా! అలా వారు ఒకనాడు వుపవాసం వున్న రోజు శివరాత్రి అయింది. అయితే, వారికి ఆ విషయం తెలియదు. మర్నాడు, భగవాన్ గిరిప్రదక్షిణానికి బయలుదేరుతూ వుంటే, వారితోపాటు మురుగనార్ కూడా బయలుదేరారు. క్రితంరోజు వుపవాసం వుండడం వలన నీరసంగా వున్న మురుగనార్ను చూసి భగవాన్, "ఏమిటి! శివరాత్రి వుపవాసమా! చాలా నీరసించిపోయారే! సరి, సరి, నాతోపాటు ఆశ్రమానికి రండి. అక్కడే భోజనం చేద్దాం" అని ఆయనను తమవెంట తీసుకెళ్ళారు. భోజనం చేస్తున్నపుడు వారి ఆకలిని ఎరిగి ఎంతో ఆదరంతో భగవాన్ వడ్డన చేయించారు. ఈ ఘటనను అంతా ఒక పద్యంగా రచించారు మురుగనార్. దీనిని గురించి వారు ఎపుడైనా మరల చెబుతూ వుంటే, కళ్ళల్లో అశ్రువులు నిండి, డగ్గుత్తికతో నోట మాట రాక తడబడేవారు. వారిద్దరి మధ్యా ఇలాంటివి ఎన్నో సంఘటనలు జరిగాయి. వాటిల్లో స్వారస్యమైనవి కూడా వున్నాయి.

"తిరుచ్చుళిలో ఒక గొప్ప ఋషి (జ్ఞాని)గా అవతరించిన భగవాన్, భక్తుల తలరాతను మార్చే జ్ఞాని" అని శ్రీమురుగనార్ అన్నారు. "శ్రీరమణులు శాస్త్రాలు తెలియని ఘనాపాటి. అయినా అనేక స్తోత్రాలచేత స్తుతింపబడే జ్ఞానసూర్యుడు. ఏ గ్రంథమూ చదవకుండానే, అష్టదిక్కులలోనివారు మెచ్చదగిన పండితుడు" అని వీరు శ్రీరమణ సన్నిధిమురైలో, భగవానుని గుణగణాలను ఆకాశమంతగా పొగిడారు. "ఆత్మజ్ఞానానుభవమైన మీ మౌనగ్రంథానికి, జ్ఞానాన్ని గురించి వివరించే ప్రాచీన గ్రంథాలూ, వాటికి పూర్వజ్ఞానులు చేసిన వ్యాఖ్యలు వుపోద్ఘాతమే తప్ప మరేమీ కాద"ని రమణ పురాణంలో భగవానుని మౌనోపదేశాన్ని గురించి అత్యున్నతంగా చెప్పారు.

## పొదుపైన సంసార జీవనం

అరుణాచలేశ్వరుని అనుగ్రహంతో అరుణాచలంలో పుష్పించిన రమణాచార్యుని కని, లోకానికి ఇచ్చిన మాతృమూర్తి అలఘుమ్మగారి సమాధి పాలితీర్థపు గట్టున కట్టిన తరువాత, ఆ స్థలానికి "శ్రీరమణాశ్రమము" అనే పేరు వచ్చింది. మొదట్లో ఈ ఆశ్రమం ఎంతో చిన్నదిగా వుండేది. ఆ రోజులలో భగవాన్ వంటశాలకు వెళ్ళి వంట చేసేవారికి అక్కడ సహాయపడుతూ, తాము కూడా ఏదో ఒక పనిలో నిమగ్నమై వుంటూ వుండేవారు. వంట ఇంట్లో భగవాన్ సహాయపడుతున్న సంగతి తెలుసుకొని, వారి దర్శనం కోసం వచ్చే వుద్యోగస్థులు కూడా ఏదో ఒక పనిని భగవాన్తో చేయడానికి, తమకు తామే పూనుకొనేవారు. భగవాన్తో సన్నిహితంగా మెలగడానికి వారికి అదొక అరుదైన అవకాశం. ఈ అవకాశాన్ని వారు ఎన్నడూ జారవిడుచుకొనేవారు కాదు.

ఒకసారి భగవాన్ వంట ఇంట్లో ఆకుకూర తరుగుతున్నారు. వారికి మురుగనార్ కూడా అపుడు సాయం చేస్తున్నారు. కూర తరుగుతూ భగవాన్ 'తాము గిరిమీద వున్న రోజుల్లో ఆకుకూరలు కోసుకొనివచ్చి, కీరపాటి వంటకు ఎలా వుపయోగించిందన్న విషయాన్ని మురుగనార్తో ఎంతో స్వారస్యంగా చెప్పారు.

గిరిమీద వున్న కీరపాటి వంట కోసం చింతచెట్టు ఎక్కి, తాము చింతచిగురు కోసిన విషయమూ, ఆమె (కీరపాటి) అనేక రకాల ఆకులను కోసుకొని వచ్చి వండి, తనకు ఇస్తున్నపుడు, "స్వామీ! ఇది కంటికి చలవ, దీనిని తింటే తలకు నూనె రాసుకోనక్కర్లేదు. ఈ కూర తింటే, ఎలాంటి మలబద్ధకమూ వుండదు" అని ఒక్కొక్క కూర లక్షణాన్ని చెప్పిన విషయమూ, ఆమె వండి తీసుకొచ్చిన ఆకుకూరలు అమృత సదృశంగా వుండేవన్న విషయమూ చెప్పి, తాను అపుడు తరుగుతున్న ఆకుకూర తిన్నట్లయితే, ఒంటికి కలిగే లాభాలను వివరించారు. ఈ గిరిమీద కొన్ని అరుదైన ఆకుల్ని తింటే, ఆకలిదప్పులు వుండవనీ, సిద్ధపురుషులు వీటిని తిని కొన్ని వందల సంవత్సరాలు జీవించినట్లు చరిత్ర చెపుతున్నదనీ, ఇంకా కొన్ని అపూర్వమైన మూలికల ప్రభావం చేత ఆకలి దప్పులు లేకపోవడంతో పాటు, ఇతరుల కంటికి

కనిపించకుండా తలచినంతనే ఎక్కడికంటే అక్కడికి (అనుకున్న స్థలానికి) వెళ్ళి వచ్చేవారనీ చెపుతూ, భగవాన్ వీటితోపాటు ఆకుకూరల గుణగణాలు కూడా చెప్పగా వింటున్నవారు చేస్తున్న పనులను మరచిపోరా?

ఆకుకూర తరుగుతున్న మురుగనార్ ఒకసారి అలా భగవాన్ చెపుతున్న విషయాలమీదే మనస్సు లగ్నం కాగా, శరీరం మరచి, చేస్తున్న పనిని మరచిపోయారు. కానీ, భగవాన్ ఏమో, తమ పక్కన వున్న ఆకులను అన్నిటినీ తరిగారు. మురుగనార్ వైపు వున్న కూర మాత్రం వున్నది వున్నట్లే వుంది. పాపం ఆయన భగవాన్ మాటల్లో లీనమైనారు కదా! ఇంక కూర ఎలా తరుగుతారు?

భగవాన్ తాము తరిగిన కూర పేర్లను ఒకవైపు తోసి, వాటితోపాటు మురుగనార్ తరిగిన కూర పేర్లను కలుపుదామని ఆయన తరిగినదానిని చూసి, వారితో "చాలా బావుంది! మీరు కూర తరిగిన లక్షణం! మీరు సంసారం చేసి జీవించినట్లే వుంది" అని హాస్యంగా అన్నారు. భగవాన్ తనను చూసి ఇలా అన్న తరువాతే, ఆయన తాను తరిగినవాటిని చూసారు. అంతా చిందరవందరగా వుంది. తాను వాటిని చేతికొచ్చినట్లు తుంచి, అడ్డదిడ్డంగా పరిచారు. భగవాన్ వాటిల్లోని ఒక పేరును తీసి, "ఇలాగేనే తరగడం?" అని ఆయనకు చూపించారు. భగవాన్ తరిగిన ఆకు పేర్లను వారు చక్కగా ఒక కట్టలాగ పెట్టడం చూసి, మురుగనార్ ఆశ్చర్యపోయారు. భగవాన్ ఏది చేసినా ఎంతో అందంగా, చక్కగా చేస్తారు. మాట్లాడుతూ మాట్లాడుతూనే వారు ఎంతో నేర్పుగా పనిని కూడా చేసేవారు.

భగవాన్ తనకు ఈ సంఘటనద్వారా బోధించిన బోధకు సమాధానంగా మురుగనార్ ఒక పద్యం వ్రాసి, శ్రీరమణుల సోఫాపై పెట్టి వెళ్ళిపోయారు. బయట నుంచి వచ్చిన భగవాన్ ఆ పద్యం చదివి తమలో తామే నవ్వుకున్నారు. వారి ఆ నవ్వుకు కారణం తెలియక భక్తుడొకరు "భగవాన్ మీరు చదివిన పద్య భావం ఏమిటో చెపితే, మేము కూడా దానిని అనుభవిస్తాం కదా!" అనగా భగవాన్ ఆ పద్యాన్ని వ్రాసిన చీటీని వారికి ఇచ్చి నవ్వారు.

ఆ పద్యం చదివినా అర్థం కాని ఆ భక్తుడు, "భగవాన్! దీనికి మీరే అర్థం చెప్పండి!" అన్నారు. దానికి శ్రీభగవాన్ "అదా! మేము వంటింట్లో ఆకుకూర తరిగాం. అయితే మురుగనార్ ఆకులు సరిగ్గా తరగకపోవడం చూసి, "అది మీరు సంసారం చేసి జీవించినట్లే వుంది" అని అంటే, దానికి వారు నన్ను "తగిన సహధర్మచారిణితో కాపురం చేయండి" అంటున్నారని చెప్పి నవ్వారు. శ్రీమురుగనార్ వ్రాసిన పద్యభావం ఇది:

"భిక్షకుని వేషం ధరించిన రమణా! ఇంటింటికి తిరిగి బిచ్చమెత్తి కష్టపడడం, బాధపడడం ఎందుకు? మీ అభిప్రాయాలకు, అభిరుచులకు తగిన స్త్రీతో సాహచర్యం చేస్తూ చక్కగా, పొదుపుగా సంసారం చేస్తూ జీవితం గడపండి!" తరువాత వారు ఈ పద్యాన్ని 'శ్రీరమణ సన్నిధిమురై'లో చేర్చారు.

## వడ్రంగం తెలియనివాడు

శ్రీరమణాశ్రమం పెద్దదిగా విస్తరించక ముందు, అక్కడి భక్తులకు కొన్ని అలవాట్లు వుండేవి. 'భగవాన్ భోజనం చేసిన విస్తర్లలోనే భోజనం చేయడం, వారు భోజనం చేసిన తరువాత చేతులు కడుక్కొన్న నీళ్ళను (ఆ రోజుల్లో భగవాన్ ఒక పాత్రలో చేతులు కడుక్కొనేవారు) తీర్థంగా తీసుకోవడం, భగవాన్ కాళ్ళు కడుక్కొన్న నీళ్ళను శిరస్సుపై చల్లుకోవడంలాంటివి' ఆ రోజుల్లో భక్తులకు లభించిన రాయితీలు. అయితే ఇవన్నీ భగవాన్కు తెలియకుండా జరిగేవి! కొన్ని సమయాల్లో తెలిసినప్పటికీ, వీటి విషయంగా వారు ఏమీ అనేవారు కాదు. కానీ, అదేపనిగా వారిలో వారు పోటీ పడినట్లు తెలిస్తే, వీటిని భగవాన్ ఆపేవారు. మధ్యాహ్న వేళలో భగవాన్ భోజనం చేసి లేచిన తరువాత, ఆశ్రమంలో పని చేసే భక్తులు రోజుకు ఒకరు చొప్పున వంతులు వేసుకొని, వారి ఆకులో భోజనం చేసేవారు. రాత్రిపూట కూడా అలాగే చేసేవారు. బహుశ ఈ పని ఎవ్వరికీ తెలియకుండా జరిపేవారు! తెలిస్తే భగవాన్ ఏమంటారో అనే భయం!

ఎవరి ద్వారానో ఈ విషయం మురుగనార్కు తెలిసింది. దేనినీ పట్టించుకోని మురుగనార్కు ఈ విషయం తెలియగానే, భగవాన్ తిన్న విస్తరి అడిగి తీసుకెళ్ళి, దానిలో తానే తినాలనే కోరిక కలిగింది. 'కానీ, ఎవరిని అడగాలి? ఎపుడు అడగాలి?' అనే విచికిత్సలో పడ్డారు ఆయన.

ఒకరోజు మధ్యాహ్నం భగవాన్ భోజనం చేసి లేచి బయటకు వెళ్ళాక, మురుగనార్ సంకోచిస్తూ భోజన హాలులోకి వెళ్ళారు. కానీ, ఎవరిని అడగాలి? అని సంకోచిస్తూ చుట్టూ చూడగా, అక్కడ నిలుచున్న శాంతమ్మ కనిపించింది. దానితో మురుగనార్కు కాస్త ధైర్యం వచ్చింది. దానికి కారణం ఇద్దరూ రామనాథపురంవారు కావడం. పోగా ఆశ్రమానికి రావడానికి ముందే, రెండు కుటుంబాల మధ్య స్నేహ సంబంధాలు వుండేవి. ఎన్నడూ భోజనశాలలోకి రాని మురుగనార్ను చూసిన శాంతమ్మకి ఆశ్చర్యం వేసింది. పైగా భోజనాలు అయ్యాక రావడం ఏమిటన్నది అర్థంగాక మురుగనార్ను "ఏమిటి సమాచారం?" అని అడిగింది. దానికి ఆయన "భగవాన్ భోజనం చేసిన విస్తరికోసం వచ్చాను" అన్నారు. దానికి శాంతమ్మ "భగవాన్ మధ్యాహ్నం తిన్న విస్తరిసేమో, ఇక్కడ వున్న భక్తులు తీసుకుంటారు. రాత్రి తిన్నదానిని ఏమో మేం తీసుకుంటాం" అని చెప్పింది. మధ్యాహ్నం తిన్న విస్తరి తీసుకోకపోవడానికి కారణం, ఆ భోజనం మొదలియార్ పాటి వడ్డించడం, అది వారి ఆచారానికి భంగం కావడం!

ఇది విన్న మురుగనార్ నైరాశ్యంతో కలత చెందారు. 'నాకు విస్తరైనా దొరికే భాగ్యం లేదే?' అనే వేదనతో వెళ్ళిపోయారు. దీనినంతా వారు ఒక పద్యంగా వ్రాసుకొన్నారు. దాని భావం:

"బ్రహ్మదేవునికి సుందరమైన చెక్కబొమ్మలను చెక్కే వడ్రంగపు వృత్తి తెలియదు. నాలుగు ముఖాల నుంచి (చతుర్ముఖుడు) నాలుగు వేదాలను వల్లించడమే, వారికి తెలిసింది! అలాంటి చతుర్వేద బ్రహ్మచే సృష్టింపబడిన 'ఈ దేహం' అనే గృహంలో, గత ప్రారబ్ధ ఫలితంగా దూరిన కుక్క అయిన ఇది, 'నీవే శరణం' అని నమ్మి వచ్చి నిలిచిన వేళ, పుణ్యమూర్తీ! ఓ రమణా! నీ శేషాన్నంకోసం ఆశతో నీ పాదాలకు మొక్కి దీనంగా అడుగుతున్నది!"

'వడ్రంగి పని తెలియకుండా, వేదాలను సృజించిన బ్రహ్మచేత చెక్కబడిన ఈ దేహం మనిషిగా వుంటున్నదిగానీ, దాని గుణం మాత్రం కుక్కలాగా ఎంగిలి ఆకుసే వెదుకుతున్నది!' అని దీని తాత్పర్యం. 'కుక్కగా చెక్కక మనిషిగా చెక్కినందుకు, బ్రహ్మకు వడ్రంగం పని తెలియదు' అని వెక్కిరింత!

## మురుగ మాయావి

శ్రీభగవాన్ సన్నిధిలో భక్తులు అనేకులు 'శ్రీరమణ సన్నిధిమురై' అనే మురుగనార్ కృతి నుంచి అనేక మధుర మోహన పద్యాలను పాడుతుంటారు. దైవానుగ్రహం కలిగిన కవి అయిన శ్రీమురుగనార్ రచించిన ఈ మధురమైన తమిళ పద్యాలు భక్తిరసాన్ని చిమ్మడమేగాక, వినేవారి హృదయాలను ద్రవింపచేయగలిగేవి.

శ్రీరమణ భగవాన్ ఎలా శ్రీఅరుణాచలేశ్వరునిపై తమకు వున్న హక్కుతో, పారవశ్యంతో మనస్సు ద్రవించేటట్లు వారిని స్తుతించారో; అలాగే శ్రీరమణ భగవాన్ను మురుగనార్ తన రచనల్లో స్తుతించి, భక్తితో కరిగిపోయారు.

వారు రచించిన కొన్ని పద్యాలు భక్తిభావాన్ని సూచిస్తూనే, ఎడబాటు సహించలేని విరహవేదనా, శృంగార రసమూ కూడా సూచిస్తున్నాయి.

ఈ పద్యాల భావం తెలిసి పాడేవారు తమను మరచిపోయి, సద్వస్తువుతో ఏకమై వుండేవారు. ఈ పద్యాలు అంత శక్తి కలిగినవి.

శ్రీమురుగనార్ భార్య మీనాక్షమ్మ అపుడపుడు ఆశ్రమానికి వచ్చి, భగవాన్ను దర్శిస్తూ కొన్నాళ్ళు వుండేది. భగవాన్ కూడా ఆమెమీద కనికరం చూపి, "ఆమె అడిగిందల్లా ఇవ్వమ"ని చెప్పేవారు. "మీనాక్షికి కాఫీ అంటే ప్రాణం. ఆమెకు మంచి కాఫీ ఇవ్వండి" అని భగవానే అక్కడ వున్నవారికి చెప్పేవారు.

ఒక్కొక్కసారి ఆమె చెప్పే చాడీలూ, కష్టసుఖాలూ ఎంతో ఓపికగా, దయతో వారు వినేవారు. మీనాక్షమ్మ ఆశ్రమానికి వచ్చి వున్నపుడు, తన మనోవ్యథనూ, కొరతలనూ చెప్పి, "మురుగనార్ తనను సరిగా చూసుకోకపోవడంచేత తాను ఎంతో

కష్టపడుతున్నాను అనీ, దానిని ఆయన గ్రహించడం లేద"నీ ఇంకా ఏవేవో కష్టాలనూ చెప్పుకొనేది. అన్నిటినీ భగవాన్ ఓపికగా విన్నా, వేటికీ బదులు చెప్పేవారు కాదు.

మీనాక్షమ్మ ఎపుడు వచ్చినా శ్రీభగవాన్ ముందు కూర్చొని, మురుగనార్ రచించిన 'సన్నిధిమురై' నుంచి కొన్ని పద్యాలు చదివేది. ఒకరోజు భగవాన్ ఒక విచిత్రం చేసారు. మీనాక్షమ్మను వారు దగ్గరకు రమ్మని పిలిచి, ఆమె చేతిలో వున్న 'సన్నిధిమురై' గ్రంథాన్ని తీసుకొని, అందులోని 'రమణ మాయావి' అనే భాగాన్ని తీసి ఇచ్చి, ఆమెతో "ఇదిగో చూడు మీనాక్షీ! కాసేపట్లో మురుగనార్ పల్లాకొత్తు నుంచి ఇక్కడికి వస్తారు. వారు వచ్చి కూర్చోగానే, నీవు ఈ భాగం పాడు. అయితే, చివరి వరుసల్లో వుండే 'రమణ మాయావి' అనే సంబోధనలకు బదులు, 'మురుగ మాయావి' అని మార్చి పాడు" అన్నారు.

కల్లాకపటం తెలీని మీనాక్షమ్మ "అలాగే" అని, మురుగనార్ రాకకోసం చూస్తూ వుంది. భగవాన్ ఆమెను పాడమన్న పద్యాల సారాంశం ఏమిటంటే, "మురుగనార్ తనను నాయికగా, భగవాన్ను నాయకునిగా వర్ణించారు. నాయకుని ఎడబాటు సహించలేక, చెప్పలేని వేదనతో అతడిని తలచి తలచి నాయిక కరిగిపోతున్నది. ఇంతకుముందు తనతో కలిసి వున్నపుడు అదే నాయకుడు ప్రేమాదరాలు చూపినా, ఇప్పుడు మాత్రం తనను విడువడాన్ని తలచి వ్యథ చెందుతున్నది ఆమె. కానీ, ఆ నాయకుడు ఏమో దానిని అంతా వినీ విననట్లు, చూసీ చూడనట్లు వుండడంతో, అతని పనులను 'ఒక మాయావి పనులు"గా కవి వర్ణించారు. భగవాన్ మీనాక్షమ్మను చదవమన్నది ఈ భాగాన్నే.

కాసేపటికి ఎప్పటివలె మురుగనార్ వచ్చి, హాలులో భగవాన్ ముందు కూర్చున్నారు. వారు వచ్చి అక్కడ కూర్చున్న వెంటనే, మీనాక్షమ్మ పై భాగాన్ని చదవడం ప్రారంభించింది. భగవాన్ చెప్పినట్లుగానే, ఆమె 'రమణ మాయావి' అని వున్నచోట్ల 'మురుగ మాయావి' అని మార్చి చదివింది. దీనిని గ్రహించి కూడా మురుగనార్ ఏమీ మాట్లాడలేదు. దీనికి కారణం కొందరు భక్తులు భగవాను 'మురుగస్వామి (సుబ్రహ్మణ్య స్వామి) యొక్క అపర అవతారం'గా భావించి స్తుతించడమే. వారంతా ఆమె ఆ భావంతోనే పాడుతున్నది అనుకొన్నారు. ఆమె తరువాత వున్న రెండవ పాటను కూడా అదే విధంగా పాడినప్పటికీ, మురుగనార్ అలాగే ఊరక వుండిపోయారు. మీనాక్షమ్మ పాడిన పై రెండు పాటల భావం:

1. ప్రేమ పొంగడం వలన నన్ను ఆకర్షించి ఆనందించిన నీవు, తరువాత అనేకసార్లు ప్రేమ లేనివాడివలె నావైపు అయినా చూడకుండా వున్నావు. అలా వున్నావని నేను ఇపుడు అంటే, "లేదు లేదు. అదంతా ఊహే సుమా" అంటావు నువ్వు. నీ స్థితిని వేదరాలు అయిన నాలాంటి స్త్రీలు చెప్పగలరా? వేదాలకే వస్తువైన ఓ మురుగ మాయావీ?!

2. మోహ మైకాలచేత నన్ను వివాహమాడిన నువ్వు, ఆ తరువాత ఎంచలేని అనేక సమయాలు నేను సుఖిస్తూ జీవించడానికి రానే లేదు. దాన్నంతా తలచి నీకు చెపితే, "అదంతా అవాస్తవమైన స్వప్నం" అని చెపుతున్నావు. అలా వున్న నీతో, నాలాంటి కన్నెపిల్లలు వుండి జీవింప తగునా? ఓ మురుగ మాయావీ?!

ఈ పాటను విని కూడ నిశ్చలంగా తన దగ్గరే కూర్చున్న మురుగనార్ను చూసి, భగవాన్ ఇటు చిలిపిగా నవ్వడమూ, అటు మీనాక్షమ్మను చూసి ఆమోదిస్తున్నట్లుగానూ వున్నారు! భగవాన్ను అపుడు చూసిన మురుగనార్కు అంతా అర్థమైంది. ఇదేదో వారు ఒక పథకం ప్రకారంగా జరిపిస్తున్న విషయం అని ఆయన గ్రహించారు. అంతలో మూడవ పాటను కూడా ఆమె 'ఓ మురుగ మాయావీ'తో పూర్తి చేసింది.

మురుగనార్ అంతా చూస్తూనే వున్నారు. భగవాన్ మాత్రం చిలిపిగా నవ్వుతూ వున్నారు. మురుగనార్కు ఏమి చేయాలో తెలియక, హాలులోంచి బయటకు వెళ్ళడానికి రెండడుగులు వేసారు. వెంటనే భగవాన్, "ఏమోయ్! ఎందుకు వెళ్ళిపోతున్నారు. 'మురుగ మాయావి' అని పాడినందుకు వెళుతున్నారా? అలా అయితే 'రమణ మాయావి' అని ఎవరైనా పాడితే, నేను కూడా వెళ్ళాల్సిందేనా? అంతే కదా!" అని నవ్వుతూ అడిగారు. ఈ మాటలు వింటూ వాటికి బదులు ఏమీ చెప్పకుండానే, మురుగనార్ నిశ్శబ్దంగా బయటకు వెళ్ళిపోయారు. మాయానాటక సూత్రధారి అయిన భగవాన్ తమ భక్తులకోసం అనేక పన్నాగాలతో ఆటలాడి, తద్వారా సత్యాన్ని గ్రహించేటట్లు చేస్తారు. మహాత్ములు ఆటల్లో కూడా వుపదేశం వుంటుంది.

ఇంకోసారి మురుగనార్ హాలులో అందరికీ ప్రసాదం పంచి పెడుతున్నారు. అక్కడ మీనాక్షమ్మ కూడా వుంది. అందరికీ ప్రసాదం ఇస్తూ వచ్చిన మురుగనార్, ఆమెకు మాత్రం ఇవ్వలేదు. వితరణ కాగా, మిగిలిన ప్రసాదాన్ని ఆయన ఆఫీసులో పంచడానికి తీసుకెళ్ళారు.

ఆయన హాల్లోంచి వెళ్ళాక మీనాక్షమ్మ భగవాన్తో "చూసారా! అందరికీ ఆయన ప్రసాదం ఇచ్చి నాకు మాత్రం ఇవ్వలేదు" అని తన అసంతృప్తిని ప్రకటిస్తూ ఫిర్యాదు చేసింది. దానికి భగవాన్ "ఊ, ఊ" అంటూ మురుగనార్ రాగానే, "ఏమోయ్ మీనాక్షికి ప్రసాదం ఎందుకు ఇవ్వలేదు?" అని అడిగారు. "అందరూ ప్రసాదంకోసం చెయ్యి చాపారు. మరి ఆమె ఏమో చాపలేదు. అందువల్ల ఇవ్వలేదు" అన్నారు.

వెంటనే భగవాన్ మీనాక్షమ్మతో, "అందరిలాగా చెయ్యి ఎందుకు చాపలేదమ్మా?" అని అడుగగా, ఆమె బదులు ఏమీ చెప్పకుండా ఊరుకుంది. 'అసలు ఆయనే తనను చెయ్యి చాపమని ప్రసాదం పెడతారు' అనుకుంది పాపం. అందుకోసం ఆమె చెయ్యి చాపలేదు. అలాంటపుడు ఇక భగవాన్కు ఆమె ఏమి సమాధానం చెపుతుంది పాపం! ఇలా కొన్ని విచిత్ర సంఘటనలు అపుడపుడు జరిగాయి.

## మూలధనాన్నే కబళించి వేసే గురువు

శ్రీభగవాన్ సన్నిధి కల్పవృక్షంలాంటిది. దాని ఛాయలో వుంటున్న భక్తులు, ఏమి కోరుకుంటే అవి వారికి లభిస్తాయి. అంటే నోటితో అడగాల్సిన అవసరం లేదు. ఇది భగవాన్ సన్నిధి మహిమ.

ఇక్కడ వుంటున్న భక్తులకు అనేక పెద్దల దర్శనం, కోరకుండానే దానంతట అదే దొరుకుతుంది. ఆ పెద్దలు భగవాన్ దర్శనంకోసం వస్తారు కదా! అందువల్ల అన్నమాట. కొన్ని సందర్భాలలో ఆ పెద్దలు వున్న స్థలాలకు వెళ్ళినా, వారి దర్శనం దొరకకపోవచ్చును. అలాంటి పెద్దలు కూడా భగవాన్ దగ్గరకు వస్తే, మనలో ఒకరుగా, భగవాన్ ముందు కూర్చోవలసి వచ్చేది. వారికి ఎలాంటి ప్రత్యేక ఏర్పాట్లూ చేసేవారు కాదు. వారికోసం వేరేగా ఆసనాలు వేసినా, వాటిని తీసేసి వారు క్రిందనే సహజంగా కూర్చునేవారు. ఇది సన్నిధిలో వుంటున్న భక్తులకు ఎంతో లాభదాయకంగా వుండేది.

దీనితోపాటు మరొక లాభం కూడా కలిగేది. అనేకమంది భక్తులు వచ్చి తమ సందేహాలను అడిగి, భగవాన్నుండి సమాధానాలు పొందినపుడు, అది కూడా మనకు లాభమే కదా! పైగా ఆ సమాధానాలు, ఆ అడిగినవారికి ఎంత వుపయోగపడేదీ వారికే తెలుస్తుంది తప్ప మనకు తెలియదు. కానీ, ఆ సమాధానాలు మన సందేహాలను కూడా తీరుస్తాయి. దీనితో సమానమైన సిద్ధి ఎక్కడ వుంటుంది? సిద్ధులను గురించి గొప్పగా మాట్లాడేవారికి అర్థమైతే, వాటిని ఇక పొగడరు.

ఒకసారి స్వామి విలక్షణానంద శిష్యులు ఒకరు భగవాన్ దర్శనంకోసం వచ్చారు. వచ్చి వారు భగవాన్ను "స్వామి విలక్షణానంద తమ శిష్యులను ప్రతిరోజు కొన్ని వేలనామ జపం చేసి, దానిని గురువుకు అర్పించాలని చెప్పేవారు. నేను కూడా అలాగే చేస్తున్నాను. మరి ఇక్కడి పద్ధతి ఏమిటి?" అని సంకోచిస్తూ అడిగారు.

ఇది విన్న భగవాన్ నవ్వుతూ, "ఓహో! అలాగా! ఫరవాలేదే! గురువుకు శ్రమ లేకుండా, శిష్యులే నామజపం చేసి ఇస్తున్నారే! ఈ గురువుకు మంచి లాభమే అన్న మాట!" అని అంటున్నపుడే మురుగనార్ అక్కడికి వచ్చారు. దానితో భగవాన్ మురుగనార్ను వుద్దేశించి, "వీరు చెప్పింది విన్నారా? వీరి గురువు శిష్యులను 'ప్రతిరోజూ కొన్ని వేలు నామజపం చేసి, దానిని తనకు కానుకగా అర్పించమ'ని చెప్పేవారట! ఇక ఆ శిష్యులకు మిగిలేది ఏమిటి? అసలును వుంచుకొని వడ్డీ ఇచ్చునట్లు, గురువుకు కానుకగా ఇవ్వాలి. ఎలా వుంది ఈ ఏర్పాటు?" అని నవ్వుతూ అన్నారు.

ఇది విన్న మురుగనార్, "ఆ గురువు ఎంతో మేలు! కనీసం అసలు అయినా వదలుతున్నారు! వారు అడుగుతున్నది వడ్డీని మాత్రమే కదా! (భగవాన్ను చూపిస్తూ) ఈ గురువు ఏమో అసలునే మింగేస్తున్నారే! ఇక వడ్డీ ఇవ్వడానికి ఎవరు

మిగిలి వుంటారు కనుక! అసలూ, వడ్డీ ఒకేసారి తీరిపోతాయి. ఆ పైన ఏముంటుంది?!" అని సజల నయనాలతో సమాధానం చెప్పారు. దీనిని అంతా వింటున్న శ్రీభగవాన్ చిరునవ్వుతో ప్రకాశించారు.

అంటే 'భగవాన్ తనను చేరిన భక్తుల అహంకారాన్ని (మనస్సును) మొదట నశింపచేస్తారు' అని భావం. మనస్సు వుంటే కదా - నామంగానీ, జపంగానీ చేసి గురువుకు దానిని కానుకగా ఇవ్వడం. 'మనస్సే నశించాక, ఇక చేయడం ఎలా?' అని మురుగనార్ పైన చెప్పినదాని భావం.

మనస్సే 'మూలధనం.' జపం అనే మనస్సుతో చేసే క్రియే 'దానికి వడ్డీ.' లోకంలో శాంతితో జీవించాలనుకున్న ప్రజలు, తమకు అంటూ కొంత ధనాన్ని మూలధనం (అసలు)గా పెట్టి, దానిద్వారా వచ్చే వడ్డీతో తమ సంసారాన్ని నడుపుకోవడం దీనికి వుదాహరణ. దీనివలన వారి జీవిత సమస్యలు పోతాయి. విధివశాత్తు - కర్మఫలానుసారం - వారు ఆ మూలధనం పోగొట్టుకొంటే, దానిపై ఆధారపడి జీవిస్తున్నందు వలన, శాంతిని కోల్పోయి వారు ఎనలేని దుఃఖాన్ని పొందుతున్నారు. అయితే, ఇక్కడ భగవాన్చే అపహరింపబడిన మూలధనమైన అహంకారం (మనస్సు) పోతే, భక్తులు కష్టపడకపోగా, శాంతిని పొందుతున్నారు. భగవాన్ ప్రభావాన్ని ఏమని చెప్పాలి!

## బ్రాహ్మణులు ఎవరు?

శ్రీమురుగనార్ ఆశ్రమానికి వచ్చిన తొలి రోజుల్లో, తన తల్లితండ్రుల శ్రాద్ధాలను, వాటికి అవసరమైన పనులన్నీ సక్రమంగా చేస్తూ, పెట్టేవారు. కానీ, కాలక్రమేణా అది తగ్గి, చివరకు పెట్టడం ఆపేసారు.

ఒకసారి మురుగనార్ తల్లి ఆబ్దికం వచ్చింది. ఆ రోజు తెల్లవారగానే స్నానం చేసి, మడిగుడ్డను ఆరవేసి, మోకాళ్ళదాకా వుండే ఒక తడిగుడ్డను నడుముకు చుట్టుకొని, వారు కాయగూరలు తరుగుతున్నారు. భగవాన్ కూడా కాయగూరలు తరగడానికి వచ్చి కూర్చున్నారు. వంట గదిలో ఒకవైపున మడిగుడ్డ ఆరవేసి వుండడం, మురుగనార్ నడుముకు తడిగుడ్డ వుండడం చూసి, భగవాన్ ఈవేళ ఏదో విశేషం వుండాలని దానిని తెలుసుకున్నట్లుగా మురుగనార్తో “ఓహో! అమ్మగారి తద్దినమా? అందుకే మడిగుడ్డ ఆరవేసి, మీరు తడిగుడ్డ కట్టుకొని కూరలు తరుగుతున్నారా? ఇంతకూ బ్రాహ్మణులు ఎవరు?" అని అడిగారు.

అంతా వింటున్న మురుగనార్ జవాబు చెప్పలేదు వెంటనే. భగవాన్ తామే మొదలుపెట్టి “సరి నేను ఒక బ్రాహ్మణుడిని వున్నాను!” అని చేత్తో తన ఛాతీమీద తట్టుకుంటూ “మరో బ్రాహ్మణుడు ఎవరు?” అని అడిగారు. దీనికి కూడా మురుగనార్ సమాధానం చెప్పకుండా వుంటే, వంటపనిలో వున్న రంగారావును చూపిస్తూ భగవాన్, “పోతేపోయె. వారిని మరో బ్రాహ్మడిగా పెట్టుకోండి” అన్నారు.

భగవాన్ తన ఛాతీమీద తడుతూ, "నేను ఒక బ్రాహ్మణుడిని వున్నాను. మరో బ్రాహ్మణుడు ఎవరు?" అన్నపుడే, అంటే బ్రాహ్మణుడిని అనే పదం వారి నోటి నుండి వచ్చినపుడే, ఆ వాక్కే శ్రీమురుగనార్ జననీ జనకుల్ని, తాత ముత్తాతలను (పితృ, పితామహ, ప్రపితామహుల్ని) ముక్తి తీరం చేర్చినట్లే. అయినపుడు శ్రాద్ధాలను పెట్టవలసిన పని ఏముంది? ఇక అప్పటినుండి వారికి శ్రాద్ధాలు పెట్టడం మీద ఆసక్తి పోయింది.

ఆసక్తి పోయినా, మరోసారి మురుగనార్ తన తల్లి శ్రాద్ధంనాడు ఒక పనస పండు తీసుకొని వంటింట్లోకి వచ్చారు. ఆ సమయంలో భగవాన్ అక్కడ వంట గురించి ఏదో చెపుతున్నారు. పనసపండుతో వచ్చిన మురుగనార్ను చూసి భగవాన్, “ఓహో! అమ్మగారి ఆబ్దికం కాబోలు - ఏం చేయడం! వాసన వదలను అంటున్నది! సరి సరి" అంటూ వారు తప్పుకున్నారు. విన్న మురుగనార్ "ఇంక దీనికి కూడా మోక్షం ఇవ్వబడింది" అంటూ బయటకు వెళ్ళిపోయారు. దీని తరువాత ఏదీ చేసేవారు కాదు. ఇలా భగవాన్ మురుగనార్ వాసనలను శోధించి పట్టి, పారద్రోలి వారిని శుద్ధస్ఫటికంగా చేసారు. దీనిని అంతా మురుగనార్ 'రమణ సన్నిధిమురై'లో కొన్ని పద్యాలుగా వ్రాసారు.

## చదువులో ఏమీ లేదని తెలుసుకోవడానికే చదువు

"సత్యాన్ని తెలుపని గ్రంథాలు నిరుపయోగం" అంటారు మురుగనార్. "తనకు గ్రంథాల మీద వున్న ప్రేమను, భగవాన్ తన మౌనంచేతనే పోగొట్టార"ని రమణ పురాణంలోని ఒక పద్యంలో వారు చెప్పుకున్నారు.

ఒకసారి కొన్ని గ్రంథాలను గురించిన సమాచారాన్ని భగవాన్ మురుగనార్ను అడుగగా, దాన్నంతా వారికి చెప్పారు. అపుడు భగవాన్, "చివరికి చూస్తే, అన్ని గ్రంథాలూ తేల్చి చెప్పేది ఒక్కటే. వాటిని వివరించే పద్ధతి మాత్రమే వేరేగా వుంటుంది. దారులు ఏవైనా, 'ఎన్నైనా' చేరేది ఒక్కచోటికే?" అన్నారు. వెంటనే మురుగనార్ "అవునవును. చివరకు తేలుతున్నది అదే. ఈ నిజం తెలిసిన తరువాత చూస్తే, 'ఇన్ని గ్రంథాలను చదవడం దండుగ' అని తెలుస్తుంది" అన్నారు.

దానికి భగవాన్, "అవును నిజమే, కానీ ఇన్ని గ్రంథాలు చదవడం వల్లనే కదా, 'చదవడం వ్యర్థం' అని తెలుస్తుంది. వాటిని చదవకపోతే, 'అందులో ఏముందో? ఇందులో ఏముందో?" అనే చాపల్యమూ, సందేహమూ కలుగుతాయి. బాగా చదివితే ఇక ఆ ఆలోచన రాదు! అంతేకాదు, వాటి వలన సత్యజ్ఞానం పొందాలన్న మోహం కూడా పోయింది. 'చదువులో ఏమీ లేదని తెలుసు కోవడానికే, చదవడం అవసరం' అవుతుంది. 'కర్మలో ఏమీ లేదని తెలుసు కోవడానికే, కర్మ చెయ్యి. పూజలో ఏమీ లేదని తెలుసుకోవడానికే, పూజ చెయ్యి' అని చెప్పడంలాంటిది ఇది" అని వివరించారు.

## పూజకు మోక్షం

మాతృమూర్తి అలఘుమ్మగారి సమాధిమీద వున్న దేవాలయం ఎంతో సుందరమైంది. దాని నిర్మాణం ఎంతో శ్రేష్ఠమైంది. ఈ గుడి చిన్నదే, కానీ దేవాలయంలో ఏవేవి వుండాలో, అవన్నీ అందులో వున్నాయి. గర్భగృహానికి ఆనుకొని వున్న ప్రాకార అంతరంలో దేవతలు, పరివార దేవతలు, నవగ్రహాలు వున్నాయి.

ఈ దేవాలయ గర్భగృహంలో ప్రతిష్ఠించిన శ్రీచక్రమేరువుయొక్క శక్తీ, మహిమా చెప్పుటకు వీలుకాదు. దక్షిణ దేశంలో ఎక్కడా కనిపించని అపూర్వ రీతిలో, ఇక్కడి శ్రీచక్రమేరువుకు విశిష్ట పూజాక్రమం ఏర్పరిచారు.

శ్రీరమణ భగవాన్ను లోకానికి ఇచ్చిన అమ్మ గుడి గోపురం: 'నాకు కలిగిన గొప్పతనం ఎవరు పొందగలుగుతారు?' అన్నట్లుగా స్ఫురింపచేస్తుంది. గుడిమీద నెమళ్ళు పురివిప్పి ఆడుతూ, గుడి చుట్టూ తిరుగుతూ వుండడం చూస్తే; మనం అక్కడే ఆనందంతో, ఆశ్చర్యంతో నిలబడిపోతాం. అంత సుందరమైన దృశ్యం అది. ఇంత సుందర దేవాలయం కట్టకముందు, అమ్మ దేవాలయం మొదట చిన్నదిగానే వుండేది. ఆ రోజుల్లో ఆశ్రమంలో జనం కూడా ఎక్కువ వుండేవారు కాదు. ఇక్కడ ప్రతిష్ఠించిన లింగానికి, 'మాతృభూతేశ్వరుడు' అని పేరు. ఆశ్రమంలో వున్న భక్తులే దీనికి అభిషేకాలూ, పూజలూ చేస్తుండేవారు. ఎవ్వరూ లేకపోతే చిన్నస్వామివారే అర్చన చేసేవారు.

ఆశ్రమంలో ఒకసారి ఎవరూ లేనందువలన, చిన్నస్వామివారు ఆ రోజు మురుగనార్ను పూజాదికములను నిర్వహించమన్నారు. వారి మాటను కాదనలేక అందుకు మురుగనార్ ఒప్పుకున్నారు. కానీ, పూజ చేయడం వారికి అంత సులభం అనిపించలేదు! ఏ పని చేసినా ఛాదస్తంగా చేయడం వారికి అలవాటుగా వుండడమే దీనికి కారణం. చేసే ప్రతి పనిలోను వారు పూర్తిగా నిమగ్నమై చేసేవారు. నిర్ణీత కాలవ్యవధిలో చేయాలన్న ఆలోచనే వారికి వుండేది కాదు. అలా చేసుకుంటూ పోతే 'అయ్యో! సమయం అయిపోయింద'ని, వారికి ఎవరైనా గుర్తు చేయవలసి వచ్చేది.

పూజకు ముందే, ఆలయంలోని లింగానికి అంటిన నూనె జిడ్డు పోగొట్టడానికి వారు బిందెలకొద్దీ నీరు పోసి, ఎంతోసేపు కడుగుతుండేవారు. లింగం చుట్టూ పానపట్టం మీద కూడా అలాగే కడవలకొద్దీ నీరు పోసి కడిగేవారు. ఒకసారి మురుగనార్ ఇలా లింగంమీద నీరు పోసి రుద్దడం చూసిన భగవాన్, "మీరు ఇలా రుద్దడం చేస్తే, కొన్ని రోజుల్లో లింగమే కనిపించకుండా పోయేటట్లు వుందే" అని నవ్వుతూ అన్నారట!

మరోరోజు వీరు చేసిన పూజ అయిపోయి, కర్పూర హారతి ఇచ్చే సమయానికి భగవాన్ అక్కడికి యాదృచ్ఛికంగా వచ్చారు. వారు రావడం మురుగనార్కు తెలియదు. మురుగనార్ ఒక చేతిలో హారతి పళ్ళెం, మరో చేతిలో గంట తీసుకొని హారతిని చూపడానికి పూనుకున్నారు. కానీ, గంట ఒక చేత్తో కొడుతూ, మరొక చేత్తో హారతి చూపితే, గంట కొట్టడం ఆగిపోతోంది. గంట కొడుతుంటే, హారతి ఆగిపోతోంది. ఎంత ప్రయత్నించినా, ఒకేసారి రెండూ చేయడం ఆయన వల్ల కావడం లేదు. వారికి ఇదే ఒక గొప్ప సాధనగా అనిపించింది.

'గంట కొడుతూ, హారతి చూపిస్తూ, మంత్రాలు చదువుతున్నారే! ఇది నిజంగా గొప్ప కార్యమే! ఎంత ప్రయత్నించినా నా వల్ల కావడం లేదే!' అని అనుకుంటుండగా, వెనుక వున్న భగవాన్ మురుగనార్ పడుతున్న బాధ, వారు దీపారాధన చేస్తున్న విధానమూ, పడుతున్న కష్టమూ, మాట్లాడుతున్న మాటలూ చూసి, "చాలు, చాలు మీరు పూజ చేస్తున్న లక్షణం, గంట కొడుతున్న సొగసు, హారతి చూపుతున్న పద్ధతి బాగానే వుంది" అనగానే, మురుగనార్ అదిరిపడ్డారు! భగవాన్ రావడం వారు చూడనే లేదు. ఒక పని చేస్తున్నపుడు వారికి మరొకదానిమీద దృష్టి వుండదు కదా!

భగవాన్ మాటలు విన్న మురుగనార్ భగవానన్ను చూస్తూ, "నేను ఇంక పూజ చేయలేను. నేను చిన్నస్వామితో చెప్పేస్తాను" అనడంతో, భగవాన్ "సరి సరి. పూజకు మోక్షం ఇచ్చేసాము" అంటూ వెళ్ళిపోయారు.

మురుగనార్ ఏకాగ్రత ఎంతో విచిత్రంగా వుండేది. ఒకసారి మురుగనార్ భగవాన్కు సాష్టాంగ నమస్కారం చేస్తున్నారు. భగవాన్ అపుడు వారిని ఏదో ముఖ్యవిషయం అడిగారు. అంతే! అపుడు తాను ఏమి చేస్తున్నదీ మరచిపోయి, నేలమీద పడుకొని వున్నవారు వున్నట్లుగానే, భగవానుకు సమాధానం ఇచ్చారు.

దీనిని అంతా గమనించిన విశ్వనాథస్వామి, మురుగనార్ తనవైపుకి వచ్చినపుడు, "ఏమిటయ్యా! విచిత్రంగా వుందే ఇది. భగవాన్ అడిగినపుడు పడుకొని వుండి సమాధానం చెప్పడమా? లేచి నిలబడి చెప్పవచ్చును కదా!" అన్నారు.

"దానికి నేనేమి చేయగలనండీ! భగవాన్ అడిగిన వెంటనే, సమాధానం ఇవ్వాలన్న ఆలోచన ఒక్కటే నా మనస్సులో వుంది. 'కూర్చొని జవాబు చెప్పాలా? నిలబడి చెప్పాలా?' అనేది ఏమీ తోచదు. మనస్సు స్తంభించి, బుద్ధి పని చేయకుండా స్ఫురణతో ఏకం కావడం వలన ఇలా జరుగుతుంది" అని కన్నీళ్ళు పెట్టుకుంటూ మురుగనార్ అన్నారు. ఇలాంటి సద్భక్తుల గురించి ఏమని చెప్పగలం?

## కురళ్ళు సంగ్రహించిన అవ్వైయార్

భగవాన్ వద్ద భక్తులు అనేక విషయాలను గురించి తెలుసుకోవడం, తమకు తెలియనివి అడిగి, వాటికి సమాధానాలు పొందడమూ జరుగుతూ వుంటుంది. కొన్ని సందర్భాలలో ఎవరూ అడుగకుండానే, భగవాన్ కొన్ని అపురూపమైన విషయాలను చెప్పడమూ వుంది.

ఒకసారి తిరువళ్ళువర్ రచించిన 'తిరుక్కురళ్' గురించిన ప్రస్తావన వచ్చింది. ఆ గ్రంథంయొక్క దివ్యత్వం, గాఢ విషయాలను కూడా సులభ రీతిలో అందులో చెప్పగలగడాన్ని గురించి అపుడు ప్రస్తావనకు వచ్చింది. ద్విపద రూపంలో వున్న ఈ కావ్యం కావ్యాలన్నింటిలో అతి చిన్నది. కానీ, భావంలో మాత్రం మిక్కిలి పెద్దది. "తిరుక్కురళ్లోని విషయం మహోన్నతమైంది" అని సంగకాలంనాటి పండితులు ఒకరు ప్రశంసించారు. "ఆవగింజను తొలిచి, అందులో సప్తసముద్రాలు అంత విషయాన్ని సంగ్రహించి ఇమిడ్చారు" అని కురళ్ళు గురించి వారి ప్రశంస.

భక్తులు కూడా భగవాన్తో ఈ భావాలనే చెపుతుండేవారు. ఇదంతా వింటున్న భగవాన్ మురుగనార్తో "ఇలాంటి కురళ్ళు కూడా సంగ్రహించి 'అవ్వైయార్' ఒక పాట రచించింది కదా?" అన్నారు. వెంటనే మురుగనార్ ఎంతో గర్వంతో, "అవును, అది ఒక తీయని పాట. ఒకసారి విద్వాంసులు అవ్వైయార్తో 'కురళ్ ప్రాశస్త్యాన్నీ, అందులో ఇమిడించిన అద్భుతమైన క్లుప్తత'నూ నోరార పొగడగా; అది విన్న అవ్వైయార్ వెంటనే "ఓహో! అలాగా అంత క్లుప్తంగా వుందా? మీరు అలా అనుకుంటున్నారా? 133 అధ్యాయాలూ, 1330 ద్విపదలూ వున్న 'కురళ్' ఎంతో క్లుప్తంగా వ్రాయబడిందా? అందులో

వున్నది 'ధర్మ, అర్థ, కామాలను' గురించే కదా! వీటిని చెప్పడానికి 1330 ద్విపదలు కావలసి వచ్చిందా?! అలాంటిదానినా మీరు సంగ్రహంగా చెప్పారు అంటున్నది?!" అని పరిహసించింది.

ఈ మాటలు విన్న ఆ పండితులు, "అంతకన్నా సంగ్రహంగా మీరు రచించి పాడగలరా?" అని అడిగారు. అది విన్న అవ్వైయార్ ఇక ఇంతకుమించి క్లుప్తంగా చెప్పలేమన్నంత క్లుప్తంగా, సునాయాసంగా, అద్భుతంగా ఒకే పద్యాన్ని రచించి గానం చేసి, వారిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆ పద్య భావం:

- "ఇక్కడ 'ధర్మం, అర్థం' అంటే ధర్మమార్గంలో సంపాదించడమే.

- భార్యాభర్తలు ఇద్దరూ తమ మనస్సు ఏకమై వుండడమే 'సుఖమూ, సంతోషమూ'.

– పరమేశ్వరుని ధ్యానించి, ఈ మూడింటినీ త్యజించడమే 'బ్రహ్మానంద పదం." అవ్వైయార్ రచించిన చమత్కారవంతమైన ఈ పద్యం విని, పండితుల నోరు మూతపడిపోయింది" అని మురుగనార్ చెప్పగా, ఆ పద్యభావాన్ని భగవాన్ ఎంతో స్పందనతో అంగీకరించారు. ఇలా ఎక్కడో మూలన పడిపోయిన, అరుదైన విషయాలు ఎన్నో భగవాన్ సన్నిధిలో మనకు అతి సులభంగా లభిస్తుండేవి.

వీటన్నిటిని మనంతట మనమే తెలుసుకోవాలంటే, ఇవి ఏయే పుస్తకాలలో వున్నాయో, మొదట తెలుసుకోవాలి కదా! పోగా ఇలాంటివన్నీ మనకు ఇప్పుడు అందుబాటులో లేని అమూల్య నిధులు. మనం దేనినీ ముట్టుకోకుండానే, మనకు లభ్యమయ్యే జ్ఞాన విధులు ఇవన్నీ!

## అవియల్ - ఆదెమ్మ

శ్రీరమణాశ్రమానికి వచ్చే భక్తులందరినీ కూడా, భోజన సమయంలో వస్తే 'వారిని భోజనం చేయమనీ, ఫలహారం వేళకు వస్తే 'ఫలహారం చేయమ'నీ అడుగుతారు. ఇది ఆశ్రమంలో వున్న గొప్ప సంప్రదాయం. ఎవరైనా భోజనం చేయలేదని భగవాన్కు తెలిస్తే, భగవానే వారిని భోజనం చేసి వెళ్ళమని చెప్పేవారు. ఎవ్వరూ ఆకలితో వుండడం భగవాన్కు ఇష్టముండేది కాదు. ఈనాటికీ ఈ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. వందలకొద్దీ పేదవారికి, వుదయం పదకొండు గంటలకు అన్నదానం ఈనాటికీ చేస్తూనే వున్నారు. దీనిని ప్రత్యక్షంగా చూస్తే, భగవాన్ అనుగ్రహశక్తి ఏ విధంగా అన్నదేవతగా ప్రసరిస్తుందో తెలుస్తుంది.

ఆశ్రమానికి ఒకరోజున నెల్లూరు నుండి ఒక తెలుగు స్త్రీ వచ్చింది. ఈమె పేరు 'ఆదెమ్మ'. ఈమె తరచుగా ఆశ్రమానికి వస్తూ పోతూ వుండడమే గాకుండా, ఆశ్రమానికి భూరి విరాళాలూ ఇచ్చేది. ఎంతో భక్తీ, సంస్కారమూ వున్న వ్యక్తి ఈమె. ఆశ్రమం వంటింట్లో సేవ చేసే వారణాసి సుబ్బలక్ష్మమ్మతో, ఈమెకు చాలా ఆత్మీయమైన స్నేహం వుండేది. ఇద్దరిదీ ఒకే ఊరు కావడం దీనికి కారణం. అంతేగాక, ఇక్కడికి రావడానికి ముందే, ఇద్దరికీ పరిచయం కూడా వుండేది. భగవాన్ గురించిన విషయాలన్నీ సుబ్బలక్ష్మమ్మ వీరికి వచ్చినపుడల్లా చెపుతుండేది.

ఒకసారి వీరు ఆశ్రమ భోజనశాలలో, భగవాన్ భోజనం చేసే స్థలానికి ఎదురుగా, భగవాన్ దృష్టి తిన్నగా తన మీద పడేటట్లుగా నిలుచున్నారు. భగవాన్ భోజన సమయానికి హాలులోకి వచ్చి తమ స్థానంలో కూర్చున్నారు. అందరికీ అన్నీ వడ్డించిన తరువాత, భగవాన్ తాము భోజనం చేయడం మొదలుపెట్టే ముందు, 'భోజనం చేయండ'ని తల ఆడించి సైగ చేసిన తరువాతే, అందరూ భోజనం చేయడం మొదలుపెట్టేవారు. ఇది అక్కడి ఆనవాయితీ.

ఆ రోజు తాము భోజనం చేసేముందు హాలంతా చూడగా, ఆదెమ్మ నుంచుని వుండడం భగవాన్ చూసారు. ఆమె ముందు వున్న విస్తర్లో అన్నీ వడ్డించే వున్నాయి. అందుకని వారు ఆమెతో, “ఎందుకు నిలుచున్నారు? భోజనానికి కూర్చోండి” అన్నారు.

భగవాన్ అలా తినమని అనగానే, ఆమె సంతోషంతో వుప్పొంగిపోయి మర్నాడూ అలాగే, భగవాన్ ఎదురుగా తన విస్తరి ముందు నిలబడి వుంటే, అందరినీ భోజనం చేయమని సైగ చేయబోతున్న భగవాన్ ఈమె నిలబడి వుండడం చూసి, వీరిని 'భోజనానికి కూర్చోమని చెప్పారు. వారు అలా చెప్పాక ఆమె భోజనానికి కూర్చొంది.

మూడవ రోజు కూడా భగవాన్ కూర్చోమన్నాకే కూర్చుందామన్న ఆలోచనతో, ఆదెమ్మ నిన్నమొన్నటిలాగే నిలుచుంది! కానీ, ఆ రోజు భగవాన్ ఏమీ అనలేదు! తెలియనివారికి చెపుతారుగానీ, తెలిసీ చేయనివారికి చెప్పరు కదా!

ఆశ్రమంలో ఆ రోజు మరో విశేషం వుంది. ఆనాడు అవియల్ చేసారు. అవియల్ వడ్డించడానికి భగవాన్ ముందుకు వచ్చిన శాంతమ్మ, ఆదెమ్మ భోజనం చేయకుండా నిలబడి వుండడం చూసి, భగవాన్కు వడ్డించాక, "ఆదెమ్మ తినడానికి కూర్చోలేద"ని వారితో అంది. అది విన్న భగవాన్ "ఆదెమ్మ తినకపోతే, తినమని చెప్పడానికి సుబ్బలక్ష్మి (ఆదెమ్మ స్నేహితురాలు అన్నమాట!) వుంది. కానీ, పాపం! మురుగనార్ను తినమని ఎవరు చెపుతున్నారు! ఈవేళ అవియల్ చేసారు కదా! వారికి ఎవరు పెడతారు?" అని కారుణ్యంతో నిండిన కంఠస్వరంతో అన్నారు. అక్కడ వున్నవారు ఇది విని నిశ్చేష్టులయ్యారు. మురుగనార్పై శ్రీభగవాన్కు ఎంత కరుణ! ఎంత ప్రేమ!

భగవాన్ అన్న ఈ మాటలు విన్న శాంతమ్మ చలించిపోయి, "భగవాన్! తక్షణం నేను వెళ్ళి వారికి అవియల్ ఇచ్చి వస్తాను" అని పరుగెత్తి వంటింట్లోకి వెళ్ళి, ఒక కొబ్బరి చిప్పలో అవియల్ పోసుకొని, మురుగనార్ వున్న పల్లాకొత్తుకు వెంటనే వెళ్ళింది.

కానీ, శాంతమ్మ మురుగనార్ వున్న పల్లాకొత్తుకు వెళ్ళి చూస్తే, వారు అక్కడ లేరు. వారు అప్పటికి టౌనుకు భిక్షకోసం వెళుతూ, ఆశ్రమంవారి మోర్వీ గెస్ట్హౌస్ దగ్గర వున్న దక్షిణామూర్తి గుడి వద్దకు చేరారు. ఇక్కడ ఈమె రోడ్డు పక్కకు వచ్చి చూస్తే, మురుగనార్ దూరంగా నడచి వెళుతుండడం కనిపించి, "సాంబమూర్తీ! సాంబమూర్తీ!" వారివైపుకు వేగంగా నడచింది. (ఇద్దరూ ఒకే ఊరువారు కావడం, అక్కడ సన్నిహిత కుటుంబాలవారూ కావడం వలన, వారిని ఇంట్లో పిలిచే పేరు ఆమెకు తెలుసు.) శాంతమ్మ పిలుపు విన్న మురుగనార్ వెనక్కి తిరిగి చూసి, ఆమె తన వైపుకు వేగంగా రావడం గమనించి ఆగిపోయారు.

వేగంగా రావడం వలన ఆయాసపడుతూ శాంతమ్మ గట్టిగా ఊపిరి పీలుస్తూ, "ఏమీ తెలియని పిచ్చోడిలాగా వున్నావే! మిమ్మల్ని తలుచుకొని అక్కడ భగవానులే జాలిపడుతుంటే, ఏదో ఒక్కరోజు అయినా ఆశ్రమంలో భోజనం చేయకూడదా?" అని అధికారంతో కూడిన కోపంతో, 'హాలులో భగవాన్ తనతో అన్న మాటలు అన్నిటినీ' పూసగుచ్చినట్లు ఆయనకు చెప్పింది.

అంతే! దానిని అంతా విన్న మురుగనార్ నిలబడలేకపోయారు. "మురుగనార్కు ఎవరు ఇస్తారు?" అని భగవాన్ కారుణ్యంతో చలించిపోవడాన్ని తలచి తలచి, వారు కరిగిపోయారు. ముఖం ఎర్రబడిపోయి, నిల్చోలేక ఆ గుడి మెట్లమీద చతికిలబడి, డగ్గుత్తికతో మాట్లాడలేకపోయారు. భగవాన్ కరుణతో అన్న మాటలకు, వారి మనస్సు పొంగిపోయింది.

శాంతమ్మ తెచ్చిన అవియల్ తీసుకొని, 'భగవానుల మహాప్రసాదం' అని కళ్ళకు అద్దుకొని, అక్కడికక్కడే కూర్చొని తినడం మొదలెట్టారు. భిక్షకు వెళ్ళాలన్న ఆలోచన కూడా ఎగిరిపోయింది. జరిగిన సంఘటనలూ, భగవానుల అపారమైన కరుణా తలచి తలచి, వారు చాలా సమయం నిశ్చలంగా వుండిపోయారు. భగవానులకు మురుగనార్పై వున్న కరుణ పైకి తెలిసేటటువంటిది కాదు. అది చాలా లోతైంది.

## మీకు ఎవరు ఇస్తారు?

ఆ రోజుల్లో ఆశ్రమంలో తైలాలు కాచడం, పళ్ళపొడి తయారు చేయడం వుండేది. ఆశ్రమంవారు తాము చేసిన పళ్ళపొడినే వాడేవారు. దానిని తయారు చేయడానికి కావలసిన వేర్లు, చెక్క మూలికలు మొదలైన సామగ్రిని అక్కడి భక్తులే సేకరించేవారు.

శ్రీభగవాన్ వంటపనితోపాటు, తైలాలు కాచడంలోను, పళ్ళపొడి చేయడంలోనూ మహాదిట్ట. 'ఏ తైలానికి ఏ సామగ్రి సేకరించాలి? వాటిని ఏయే పాళ్ళలో కలపాలి' వంటి విషయాలను భగవాన్ అటునుంచి ఇటూ, ఇటు నుంచి అటూ చెప్పగలిగేవారు. పెచ్చాలూ, వాటి తూకాలూ ఒక సూత్రంగా వారు వ్రాసి పెట్టుకున్నారు కూడా!

తైలాలను కాచేటపుడు, తామే దగ్గర వుండి భగవాన్ వాటి పాళ్ళనూ, తయారీ పద్ధతులనూ చెప్పి, పక్వం అయ్యేంతవరకు కాయించేవారు. ఒకసారి ఆశ్రమంలో ఒక తైలం కాస్తున్నారు. కాపు ఇంచుమించు పక్వానికి వచ్చింది. "కాచింది చాలేమో? వచ్చి చూడండి" అని భగవాన్ను కోరారు. గోశాల పక్క నుంచి వెళుతున్నపుడు భగవాన్ లోపలికి వచ్చి చూసి, "కాచింది చాలు పొయ్యి మీద నుంచి దింపండి" అని చెప్పి వెళ్ళిపోయారు. తైలం చల్లారాక వెంటనే వడపోయడం మొదలుపెట్టారు. ఒక పెద్ద గిన్నెపైన తెల్లగుడ్డ కట్టి, దానిమీద నుంచి తైలం వడపోయడానికి సిద్ధం చేసారు. ఆ గిన్నెమీద గుడ్డను గట్టిగా బిగించి పట్టుకొన్నారు భగవాన్. మురుగనార్ ఏమో ఒక పాత్రతో ముంచి తైలాన్ని గుడ్డమీద పోస్తున్నారు.

ఈ పని జరుగుతుండగా, భగవాన్ మురుగనార్తో ఆ తైలంలో కలిపిన మూలికల గురించీ, వాటి పాళ్ళ గురించీ, వాటి గుణాతిశయాన్ని గురించీ వివరిస్తున్నారు. భగవాన్ను చూస్తేనే తనను మరచిపోయే మురుగనార్, ఇక వారి మాటల్నే వింటుంటే ఎలా వుంటారు?! తనను మాత్రమే కాదు వారు మరచిపోయేది - చుట్టుపక్కల వున్నవారినీ, పరిసరాలనూ, చేసే పనినీ అన్నింటినీ మరచిపోతారు వారు. సన్నిహితులకు వారి ఈ స్వభావం పరిచయమే. భగవాన్ చెపుతున్నవాటిని వింటుంటే, మురుగనార్ మాత్రం తైలాన్ని ముంచి వస్త్రకాయితం (వడగట్టే బట్ట) మీద పోస్తూనే వున్నారు. వడపోస్తున్న తైలం కింది పాత్ర నిండేదాకా వచ్చింది. ఇంకాస్త పోస్తే తైలం కింది పాత్రం నుంచి పొర్లిపోతుంది. దీనిని గమనించకుండా, మురుగనార్ ముంచిన పాత్రతో తైలాన్ని బట్టమీద పోయబోయారు. కింది పాత్ర నిండిపోయే వుంది!

వెంటనే భగవాన్, "ఏమండీ! మీరేమో దిక్కులు చూస్తూ నూనె ముంచి పోస్తున్నారు! అదేమో నిండిపోయింది కదా! చూడవద్దా!" అని ఆపించారు. తడబడిన మురుగనార్ తికమకతో నూనెను బట్టమీద పోసేయనే పోసేసారు.

నూనె అంతా కారి నేలంతా నూనె నూనె అయిపోయింది. కారుతున్న నూనె చూసిన భగవాన్, "నూనె వృథాగా కారిపోతోంది. మీకు నూనె ఎవరు కాచి ఇస్తారు? దాన్నంతా మీరే బాగా రాసుకోండి! రాసుకోండి!" అని నవ్వుతూ అన్నారు. మురుగనార్ చేతిలో పాత్ర అలాగే క్రింద పడేసి, దోసిళ్ళలో నూనె తీసుకొని, తీసుకొని తలకు రాసుకోవడం మొదలెట్టారు. నూనెతోపాటు నేలమీద మట్టి కూడా చేతిలోకి వచ్చినా ఆపకుండా వారు అలాగే రాసుకుంటూ వుంటే చూసి, భగవాన్ "చాలు చాలు. నూనె రాసుకోండి అంటే మట్టికూడా రాసుకుంటున్నారే. ఆపండి" అన్నాకే, వారు రాసుకోవడం ఆపారు!

పాత్రపైన కట్టిన గుడ్డను, ఇదంతా జరుగుతున్నంత సేపూ భగవాన్ పట్టుకొని కూర్చున్నారు పాపం! గుడ్డ కాస్త కదిలితే నూనె ఇంకా కారుతుంది. ఇది మురుగనార్ చూడరు. వారికి ఇది తోచను కూడా తోచదు! అక్కడే ఏదో వంట పని చూసుకుంటున్న సుబ్బలక్ష్మమ్మ చూసి, భగవాన్ పడుతున్న అవస్థను గమనించి, ఆ గుడ్డను జాగ్రత్తగా తీసేయడానికి భగవాన్కు సాయం చేసింది! భగవాన్ చెప్పినదాని మీద మనస్సును నిమగ్నం చేయడం తప్ప, వేరే దేనిమీదా మురుగనార్ మనస్సు పోదు కదా! భగవాన్ గుడ్డ పట్టుకొని శ్రమ పడుతున్నది కూడా గమనించే ధోరణి వారికి లేదు. 'ఏకాగ్రచిత్తంతో కూడిన ఈ ఏకాగ్రభక్తియే', వారిని భగవాన్ యందు సంపూర్ణ శరణాగతుడిని చేసింది.

## సరస్వతీ పూజ

ఒక సంవత్సరం శ్రీమాతృభూతేశ్వరాలయంలో నవరాత్రి పూజలు జరుగుతున్నాయి. ఆ సందర్భంగా భగవాన్ సోఫాకు సమీపంలో, ఒక చిన్న స్టూల్మీద పూజార్హమైన కొన్ని పుస్తకాలను పెట్టి పూజ చేసారు. పల్లాకొత్తు నుంచి యథాప్రకారం భగవాన్ దర్శనానికి వచ్చిన మురుగనార్, ఆ స్టూల్ మీద వున్న పూజ చేసిన పుస్తకాలను చూసి, "ఇదేం వింత!"

అంటూ అటు భగవాన్ను, ఇటు పుస్తకాలనూ మార్చి మార్చి చూస్తూ వుండిపోయారు. తత్ఫలితంగా మనస్సులో వుదయించిన భావాలను చూపుతో బహిర్గతం చేస్తూ భగవాను చూసి, మందస్మితం చేసారు. ఆ చిరునవ్వును అర్థం చేసుకున్న భగవాన్, తమ కళ్ళతోనే దానికి సమాధానం ఇచ్చి, తాము కూడా ఒక చిరునవ్వు చిందించారు. శ్రీమురుగనార్ భగవాన్ను సాక్షాత్తూ పరవస్తువుగానే పూజించగలవారు. భగవానుల జ్ఞానానుభూతిని, మహిమను గురించి చెపుతూ వుండేవారు.

"సనాతన జ్ఞానులు శ్రేష్ఠమైన జ్ఞానశాస్త్రాలలో చెప్పిన విషయాలు - మీయొక్క విస్తారమైన ఆత్మజ్ఞానానుభూతి మౌన గ్రంథానికి వుపోద్ఘాతం మాత్రమే అవుతాయి" (శ్రీరమణ పురాణం 321, 322 వరుసలు) అన్నారు. ఇలాంటి దృష్టి వున్నందువలన, వారికి ఈ పుస్తక పూజ వింత అనిపించింది.

"ఓ భగవాన్! తమ సన్నిధిలో ఈ పుస్తకాలను వుంచి పూజ చేయడం బాగా ముదిరిన చెరుకు గడను పూర్తిగా పిప్పి చేసి, దాని రసాన్ని కాచి, పంచదార చేసి, దానిలోని మాలిన్యాన్ని కూడా తీసేసి, దానిని ముంచి ముదురు పాకంగా కాచి, రూపం వున్న అచ్చులో దానిని పోసి తీసిన పంచదార బొమ్మలాగా వుంది 'మీ దివ్యసుందర రూపం'. అలాంటి మీ రూపం ముందు, ఈ పవిత్ర గ్రంథాలు రసం పిండగా మిగిలిన పిప్పిలాగా వున్నాయి. అవన్నీ దేనిని చెప్పి స్తుతించి ప్రబోధిస్తున్నాయో, ఆ సద్వస్తువుయొక్క రహస్యమే 'మీ దివ్యరూపం'. అయినా ఈ గ్రంథాలను మీ ముందు వుంచి పూజిస్తున్నారు. ఇంకొక కోణంవైపు నుంచి చూస్తే ఇది - 'పిప్పిగా కనిపించే మా దగ్గరి నుండే కదా, ఈ దివ్యసుందర రూపం తయారైంది. దానికి కారణమైన మమ్మల్ని కూడా కాస్త గౌరవించరాదా' అని వేడుకొంటున్నట్లు వుంది ఈ పూజ." అని ఇలా ఎంతో భావగర్భితంగా ఈ ఘట్టాన్ని రచించారు మురుగనార్. దీనిని చదివిన భగవాన్ తల ఆడిస్తూ చిరునవ్వు నవ్వారు.

"ఎదురుగా భగవాన్ దర్శనం ఇస్తున్నపుడు, వారి ఎదుటే వారి ఫొటోకి పూజ చేస్తే ఎలా వుంటుందో, ఇది అలా వుంద"ని ఆ తరువాత మురుగనార్ చెప్పారు. "వాసనలు లేని మనస్సుకు, సర్వవ్యాప్తమైన పరవస్తువే కనిపిస్తుంది తప్ప మరేదీ కనిపించదని; వీరు ఇలా గ్రంథపూజ చేయడం, వాసనాబలంయొక్క ఫలితం తప్ప మరొకటి కాద"నీ కూడా వారు చెప్పారు.

శ్రీరమణ భగవానుల పాతకాలపు భక్తులలో ఒక ముఖ్యభక్తుడు 'రమణ 'పాదానందులు'. వీరు కుంభకోణంలో జన్మించారు. జన్మచేత శ్రీవైష్ణవులు అయినప్పటికీ, వీరికి సుబ్రహ్మణ్యస్వామిపై ఎంతో భక్తి. ఎపుడూ నుదుట తెల్లని విభూతి రేఖలతో, మెడలో రుద్రాక్షమాలతో శివభక్తునిగా కనిపిస్తుండేవారు. తేవారం, తిరుప్పుగళ్ పాడడమంటే, వీరికి ఎంతో సంతోషం. వీరు షేర్ బ్రోకర్గా పనిచేసి బాగా గడించారు.

శ్రీమురుగనార్ రచించిన అనేక గ్రంథాలు ప్రచురణ కావడానికి, వీరే కారణభూతులు. వీరికి భగవాన్మీద అపారమైన భక్తి. ఆ తరువాత మురుగనార్ పైన, ఆ తరువాత మురుగనార్ రచనలమీద. వీరు ఎపుడూ ఆనందభాష్పాలు కారుస్తూ, శ్రీరమణ సన్నిధిమురైలోని పద్యాలను పాడుతుండేవారు. కొన్ని సమయాలలో గాద్గద్యంతో గొంతు పైకి వచ్చేదే కాదు. అపుడు పాడడం ఆపేసి, సన్నిధిలో కన్నీరు కారుస్తూ కూర్చునేవారు. సన్నిధిమురైలోని పద్యాలను మంచి స్వరంతో తాళయుక్తంగా పాడడంలో వీరు దిట్ట. అనేక రాగాలు తెలిసినవారు వీరు. మురుగనార్ను ఎంతో ప్రేమానురాగాలతో స్తుతించిన వీరు, వారు రచించిన 'శ్రీరమణ దేవమాల, శ్రీరమణ చరణం కలకాలం వర్ధిల్లు గాక!, శ్రీరమణ సన్నిధిమురై, గురువాచక కోవై, రమణానుభూతి మొదటి భాగం' మొదలైన గ్రంథాలను ప్రచురించారు.

శివభక్తి స్తోత్రాలైన తేవారాలను రచించినట్లే, శ్రీరమణ భగవాన్ దివ్యకీర్తిని మురుగనార్ రచించారు. శ్రీకె.వి.జగన్నాథన్ గారు "నంబియాండార్ 'నంబి తేవారాల'ను తమిళ ప్రపంచానికి అందించినట్లే, రమణ పాదానందులు ఈ అపురూపమైన మురుగనార్ రచనలను అందించార"ని ప్రశంసించారు.

'శ్రీరమణ సన్నిధిమురైను లోకంలో తన గానంతో వ్యాపింప చేయడమే తన కర్తవ్యమూ, తన తపస్సూ' అని నమ్మి; దానికోసం ఒక్క తమిళనాడులోనేగాక, సముద్రాలు దాటి, తమిళులు ఏయే దేశాల్లో వుంటే ఆయా దేశాలకు వెళ్ళి, ప్రచారం చేసిన గొప్ప వ్యక్తి వీరు.

శ్రీభగవాన్ పేరునుగానీ, మురుగనార్ పేరునుగానీ తలచినపుడల్లా, ప్రస్తావనకు వచ్చినపుడల్లా ఆనందభాష్పాలతో పారవశ్యం చెందుతుండే బహు వుత్తముడు రమణ పాదానందులు. రమణ సన్నిధిమురైలో 'రమణ వైభవం' అనే ఒక ప్రత్యేక రీతిలో వున్న దశకాన్ని రచించడానికి వీరే హేతువుగా వుండడంతోపాటుగా, ఆ దశకం మధ్యలో వీరిని 'రమణ పదసుఖుడు' అని ప్రశంసించడానికి అర్హులుగా వున్నారు. వీరి ప్రయత్నమే లేకపోతే, 'శ్రీరమణ సన్నిధిమురై, గురువాచక కోవై (వచనమాల)' వంటి వుత్తమ గ్రంథాలను మనం చూడగలిగేవారం కాదు. అనేక కష్టనష్టాలకు ఓర్చి, పోరాడి, వీరు ఈ గ్రంథాలను ముద్రించి ప్రచురించారు. మురుగనార్ రచనల్లో సగానికి పైగా, వీరి ప్రయత్నం వల్లనే ప్రచురితమయ్యాయి. అవి పోగా, మిగిలిన 14వేల పద్యాలను 'రమణ కేంద్రం, ఢిల్లీ'వారు బాధ్యత తీసుకొని ప్రచురిస్తున్నారు.

మురుగనార్ రచనలలో పూర్వభాగాన్ని రమణ పాదానందులు ప్రచురించినట్లు, వుత్తర రచనలను ఆచార్య కె.స్వామినాథన్గారు బాధ్యత వహించి ప్రచురిస్తున్నారు. రమణ పాదానందులు తాము సంపాదించినదంతా కూడా, ఈ ప్రచురణలకే ఖర్చు పెట్టి, ఇంకా కొదవ ఏమైనా వస్తే స్నేహితులనుగానీ, భక్తులనుగానీ అడిగి ధనం సేకరించేవారు.

వుదారులైన వీరు, 'శ్రీరమణ సన్నిధిమురై' ప్రచురించగానే, భక్తులందరికీ వుచితంగా ఇచ్చి "పారాయణం చేయమ"ని ప్రోత్సాహపరిచేవారు. ఇంతేకాకుండా, తమిళులు ఎక్కువగా వున్న శ్రీలంక, మలేషియా వంటి దేశాలలో సంగీత విద్వాంసులచేత ఈ రచనలను గానం చేయించారు. కౌలాలంపూర్ (మలేషియా)లో ఒక వుత్సవాన్నే ఏర్పాటు చేయించారు. "ఆ వుత్సవానికి తమిళ దేశంలో ప్రఖ్యాతి చెందిన నాదస్వర విద్వాంసులను పిలిపించి, 'శ్రీరమణ సన్నిధిమురై' గ్రంథాన్ని వుంచి, దానిని బాణసంచాలు కాలుస్తూ వైభవంగా ఊరేగించగా, అక్కడి తమిళ ప్రజలు ఆ ఊరేగింపులో ఆనందంతో పాల్గొని, ఆకాశం దద్దరిల్లేటట్లుగా జయ జయధ్వానాలు చేసార"ని చూసినవారు చెపుతుంటే, మనకు ఎంత ఆశ్చర్యం కలుగుతుంది?! ఇలాగే 'యాష్ పాణం' అనే ఊర్లో కూడా వుత్సవం చేసారట!

మహాభక్తుడూ, పండితుడూ అయిన శేక్కిషార్ గానం చేసిన 'పెరియ పురాణాని'కి అనపాయ చోళుడు వుత్సవం చేసినట్లుగా; 'శ్రీరమణ సన్నిధిమురై'కు వుత్సవం చేసి ఆనందించాలని రమణ పాదానందుల అభీష్టం. అయితే వారి అభీష్టం తమిళ దేశంలో తీరకపోయినా, విదేశాల్లో నివసిస్తున్న వారి తమిళ మిత్రుల ద్వారా తీరింది.

రమణ భగవాన్ సన్నిధి ముందు ప్రతిరోజూ పూజా సమయంలో 'రమణ సన్నిధిమురై' నుండి కొన్ని పద్యాలు పాడుతూ, ఆనంద భాష్పాలు కారుస్తుండే ఈ మహాభక్తుడు జీవితాంతం ఆశ్రమంలోనే గడిపారు. శరీరం కొంతకాలం వ్యాధితో బాధపడ్డా, మనస్సును చెదరనివ్వక, ఏకాగ్రపరచి ప్రశాంతంగా శ్రీరమణ భగవానుని పాదాలను చేరారు వీరు. భగవానుని భక్తులందరూ సదా మరచిపోకుండా జ్ఞాపకం వుంచుకోవలసిన మహాభక్తులు, శ్రీరమణ పాదానందులు.

శుభం సంపూర్ణం శ్రీరమణార్పణమస్తు

మహాత్ములు ప్రపంచంలో అవతరించునపుడు వారి అవతార రహస్యమును కీర్తించి వ్యాపింప చేయటానికి కొందరు పెద్దలు కూడ దర్శనమిస్తారు. వారు రచించే గ్రంథాలు భావితరాలకు జ్ఞానజ్యోతులు, మరియు మార్గదర్శకములై సహాయపడతాయి.

శ్రీమురుగనార్ ఒక మహెూన్నత తమిళ కవితాసాగరం వంటివారు. వీరి రచనావిధానం నాటి సంగకాలపు భాషాశైలిని పోలి వుంటుంది. వీరు భగవాన్‌ని గురించి రచించిన స్తోత్రగీతాలు పద్యాలు, వాటిని ఆస్వాదించేవారి హృదయాలను ద్రవింపచేసి, ఆనందంతో పరవళ్ళు తొక్కిస్తాయి.

"ఎవరి సిఫారసు లేకుండా స్వేచ్ఛగా కూర్చుని అనుభవింపదగ్గ సన్నిధి మహిమ కేవలం భగవాన్ సమక్షంలోనే" అనేవారు. వేదాంత పండితులై వుండీ, నమ్రతకు మారుపేరు వీరు. కీర్తిప్రతిష్ఠలకు లొంగని ధీరులు.

అనేకవేల పద్యాలలో భగవానుని తప్ప ఇతర దైవాన్ని కీర్తించ లేదు. భగవాన్ బోధల సారాన్ని ఏ విధంగాను మార్పు చెందని అక్షర కళాఖండాలుగా తీర్చిదిద్దారు. ఈ గ్రంథాలు భావితరాలకు రమణుల సత్యబోధను గ్రహించడానికి సంపూర్ణంగా సహకరిస్తాయి.




www.sriramanamaharshi.org

ISBN 978-81-8288-231-7



శ్రీరమణాశ్రమము
తిరువణ్ణామలై